సందులకు వగచుచు బ్రహ్మయ్యశాస్త్రులుగారు పూర్ణారోగ్యవంతులుగా నుండుటకుఁ బరమానందము ప్రకటించిరి. ఈచమత్కారవిషయమును శాస్త్రిగారు 'నావిబుధలోకసందర్శన' మనుకావ్యమున వ్రాసి తమమధురకవితాధారను తెలుఁగువారికిఁ జూఱలిచ్చిరి.

తునిసంస్థానాధీశ్వరు లీవిమర్శకాగ్రేసరునిచే రెండువత్సరములు లుద్యోగమునకు నెలవుపెట్టించి 'పెద్దాపుర సంస్థానచరిత్ర' వ్రాయించిరి. వీరి చారిత్రకపరిశోధన కది యాదర్శము. మాధవవిద్యారణ్యులు, శిష్టు కృష్ణమూర్తికవి, నారాయణభట్టు నాచన సోముఁడు మున్నగువారి ప్రత్యేక జీవితములు వ్రాసిన చరిత్రజ్ఞుఁ డీతఁడు. వీరి వక్తృత్వ మనన్యసామాన్యము. ఉపన్యాసము నడుమ నెవరైనఁ బ్రతికక్షులు వికటప్రశ్నములు వేయఁగా వీరు సద్యస్స్ఫురణము కలిగి చక్కని సమాధానము చెప్పి మఱి మాటాడ నిచ్చెడివారు కారు. మాట మధురము. భావము తీవ్రము. దీనికి బ్రహ్మయ్యశాస్త్రిగారు పెట్టినదిపేరు.

ఇట్టి మహితాశయుండైన విమర్శకాగ్రేసరుఁడని, మహోపాధ్యాయుఁడని, ఉపన్యాసపంచాననుఁడని, ఆర్షమతోద్ధారకుఁ డని బిరుదము లన్వర్థములు కాకుండు నెట్లు ?

---

# వావిలికొలను సుబ్బారాయకవి

## ౧౮౬౩–౧౯౩౯

భారద్వాజగోత్రజులు. ఆపస్తంబసూత్రులు. గోల్కొండ వేపారి. తల్లి: కనకాంబ. తండ్రి: రామచంద్రుడు. జననము 1863–నిర్యాణము 1939 విరచితకృతులు: శకుంతలచరిత్ర, సులభవ్యాకరణము, సతీహితచర్య, ఆర్యకథానిధి (ఆరు భాగములు) నలచరిత్ర, గర్భిణి, హరిశ్చంద్రచరిత్ర, ఆంధ్రవాల్మీకిరామాయణము, కుమారహితచర్య, కుమారాభ్యుదయము, కృష్ణలీలామృతము, కౌసల్యాపరిణయము, ఏకశిలానగరద్వయ వివాదసంగ్రహము, హనుమంతచరిత్రము, భవతారకలీల, బాలకహితచర్య, భగవద్గీత, కృష్ణావతారతత్త్వము. మున్నగునవి.

శ్రీ సుబ్బారావుగారు పండితకవులుగా పేరు సంపాదించిరి. భక్తాగ్రేసరులుగా కీర్తి గాంచిరి. లోకమున గొందఱకు పాండిత్యకవిత్వములు పురాకృత విశేషమువలన కలిగి యుండవచ్చును. అట్టివా రాపాండిత్యకవిత్వ ప్రకర్షమును దేశమున వెల్లడించుటకు రామాయణము రచింపవచ్చును భాగవతము వ్రాయవచ్చును. అంతమాత్రమున నట్టికవులకు దైవభక్తి దైవ విశ్వాసము సంపూర్ణముగ నుండు ననుట పొసగదు.

అట్లుగాక, మనసుబ్బారావుగారి దైవభక్తి యవ్యాజసిద్ధమైనది. దైవభక్తియే వీరికి కవిత్వలక్షణము చెప్పినది. దైవభక్తియే యీయనను పాండిత్యవంతు నొనరించినది. భాగవతరచ

యుత పోతనామాత్యుఁడే యిందులకుఁ బ్రథమోదాహరణము. వీరిని మొదట భాగవతులని, పిదపఁ బండితుగ్న, చివరఁ గవులని చెప్పుట క్రమానుగుణము. సుబ్బారావుగారికిఁ బోతన్నపైఁ బెద్దయభిమాన మున్నది. నరకృతుల నీయక పోవుటలోను భగవద్భక్తి పారవశ్యములోను వీ రిద్దరు సహపాఠులు. కవితారచనయందు మాత్రము వీరికి పెద్దయంతర మున్నది. భాస్కరరామాయణమునకు వెనుకను ముందునుగూడఁ దెలుఁగులో నెన్నో రామాయణములు వెలువడినవి. కాని తెలుఁగుభాగవత మొక్క పోతనామాత్యరచితమే. ద్విపదభాగవత మొం డున్న దనినను నది ప్రచారములో లేదు. ఆధునికులలో నైదారుగురు యథా వాల్మీకి రామాయణములు రచించినవారును, రచించుచున్నవారును, రచింపఁదలంపు గలవారును గలరు. భాగవతము దరి కెవ్వరును బోఁజూచుట లేదు. ఇది పోతనమహాకవిలోని విశేష మేమో ? ఇట్టి కవివరునిపై మన సుబ్బారావుగారెట్టి యభిప్రాయము ప్రకటించిరో చూడుఁడు.

తుచ్ఛులు సరిగా దనినను
స్వచ్ఛపుఁబోతనకవిత్వ సంపద చిమనే
నేచ్ఛ జలిచి దూషించిన
నచ్ఛపవిత్రతను భావ మంటునె యున్నే ?

(రామాయణ పీఠిక.)

వా. సు. దాసుగారి చేతిలోఁ జాలమంది విమయస్తులు పరమ భక్తులైరి. వీరు 'భక్తసంజీవని' యను మాసపత్రిక కొన్ని వత్సరములు వెలువరించిరి. దైవ, భాషాసేవ లొకదాని నొకటి మించునట్లు గావించి ధన్యులైన సుబ్బారాయకవిగారు వాల్మీకి రామాయణము యథామాతృకముగా నాంధ్రీకరించిరి. కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మగారొక రిట్లు వ్రాసిరి. వా సు. దాసుగారి రామాయణకవితలోఁ బ్రౌఢతకు లోపములేదు. వీరు రామాయణము నిర్విఘ్నముగా రచించి తరించిరి.

కనులకుఁ గలఁకయు గరళంబు మదికిని
తపియింపఁ జేయు విత్తమ్ము లేదు
కాళ్లబందా లుర్రి తాళ్లు కుత్తుకకునా
బిడ్డల జంజాట మద్దు లేదు
మంచిసెబ్బెర లెద స్మరియింపనీయని
యంతటి భోగంబు లమరలేదు
ఈపూఁట హరిహరీ! యేపూటఁ గడమనఁ
దారిద్ర్యభీతి యింతయును లేదు
రాముఁ దలఁపఁజేయు నామయం బుండంగ
సౌఖ్య మరయుపొంతె జాయ యుండ
నింతవలను గలుగ నిక్కువ శ్రీరాముఁ
దలఁపకున్న నెపుడు దలఁచువాఁడ.

(శ్రీ రామాయణ పీఠిక.)

రామాయణరచనమున వీరియుద్దేశమిది. వీరు యావజ్జీవనమును కోదండరామస్వామికే ధారవోసిన భక్తులు. ఆయాలయమును పునరుద్ధరించుటకు వీరాంధ్రమున నెరిగి పెక్కువేలు సంపాదించి భగవదర్పితము గావించిరి.

పాపము! సుబ్బారావుగారికిఁ జిన్నతనముననే పితృవియోగము కలిగినది. పినతండ్రిగారగు లక్ష్మణరావుగారి పోషణమున విద్యాబుద్ధులఁ గఱచి పెద్దచదువు చదివిరి. ౧౧ వత్సరములు రెవెన్యూ ఇనస్పెక్టరు పనిచేసి, చెన్నపురి సర్వకళాశాలలోఁ బ్రధానాంధ్రపండితపదవి నలంకరించిరి. పుష్కలముగా ధనమార్జించిరి. చేతులార నర్థుల కిచ్చుకొనిరి. ఒక ఆంధ్రవాల్మీకి రామాయణమేగాక పేరుదెచ్చుకొనిన కృతులు కుమారాభ్యుదయము, కౌసల్యాపరిణయము, సుభద్రావిజయము మున్నగునవి రచించిరి. 'సులభవ్యాకరణము' వ్రాసిరి. ఇది వజ్ఝల చిన సీతారామశాస్త్రి ప్రభృతులు మెచ్చుకొనిరి. వచనగ్రంథములెన్నియో వీరు రచించిరి.

కడపకును నందలూరునకును నడుమనున్న పల్లెటూరు ఒంటిమెట్ట. కోదండరామస్వామియాలయ మిచటనే యున్నది. ఈరామస్వామికే పోతన భాగవత మర్పించెను. ఈరామస్వామికే వాసుదాసు రామాయణ మొసఁగెను. ఇద్దరును ధన్యులు.

# దాసు శ్రీరామకవి

## ౧౮౬౪–౧౯౦౮

ఆఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. హారితసగోత్రోద్భవుఁడు. తండ్రి: కన్నయమంత్రి. తల్లి: కామాంబ. జననము 1864. నిధనము 1908. పుట్టుక: కృష్ణామండలములోని దూరాడలో. మృతి: గోదావరిమండలములోని ఉప్పు ఏలూరులో. ఈతని ప్రత్యేకగ్రంథములు ౩౪. ౧ ఆచారనిరుక్తి ౨ దురాశాపిశాచభంజని ౩ వైశ్య ధర్మదీపిక ౪ ఆంధ్రవీథి ౫ అభినయదర్పణము ౬ కృతులు ౭ స్వరజతులు ౮ పదములు ౯ జానకీపరిణయనాటకము ౧౦ మనోలక్ష్మీవిలాసనాటకము ౧౧ అచ్చతెనుఁగు అభిజ్ఞాన శాకుంతలము ౧౨ రత్నావళి ౧౩ మాలతీమాధవము ౧౪ మాళవికాగ్నిమిత్రము ౧౫ ముద్రారాక్షసము ౧౬ ఉత్తరరామచరితము ౧౭ మహావీరచరితము ౧౮ కురంగగౌరీశంకరము ౧౯ మంజరీ మధుకరీయము ౨౦ సంగీతరసతరంగిణి యను బుద్ధనాటకము ౨౧ తర్కకౌముది ౨౨ అభినవగద్యప్రబంధము ౨౩ సాత్రాజితీవిలాసము ౨౪ లక్షణావిలాసము ౨౫ ఆంధ్రదేవీ భాగవతము ౨౬ తెలుఁగునాఁడు ౨౭ సూర్యశతకము. ౨౮ భృంగరాజమహిమ. ౨౯ సంగీతరసతరంగిణి మున్నగునవి.

దేవీభాగవతము పదునెనిమిదివేల గ్రంథము. దాని నయిదునెలలలో గద్యపద్యాత్మకముగా నాంధ్రీకరించి యాఱవనెలలో నచ్చున కిచ్చిన యాశుకవిసింహులు దాసు శ్రీరాములుగారు. ఆశుకవితమైనను నంద మెచ్చుటకు గొఱవడలేదు. దేవీభాగవత

మును మొట్టమొదటఁ దెలిఁగించినకవి ములుగు పాపయారాధ్యుఁడు. దేవీభాగవతమును మొట్టమొదటఁ బ్రచురించినకవి దాసు శ్రీరాములుగారు. తిరుపతి వేంకటకవులును దీని నతి మనోహరముగా ననువదించిరి. నేఁటి కీయుభయకవుల గ్రంథములును ముద్రణము నందియున్నవి. త్రిపురాన తమ్మన దొరగారు కూడ దీని ననువదించినటుల తెలియును. అదికూడ నచ్చుపడినచో నాంధ్రీకృతప్రకటిత దేవీభాగవతముల సంఖ్యనాలుగు.

శ్రీ రామకవిగారు తల్లిదండ్రుల కేకైకపుత్రులు. ఆకారణమునఁ జిన్ననాఁటినుండియుఁ గడు గారాబముగాఁ బెరిగిరి. కృష్ణామండలములోని 'అల్లూరు' వీరి పూర్వులకుఁ బూర్వప్రభువు లొసంగిరి. అందుచే వీరి జీవనమునకు లోటులేదు. తొలుత వీరిని బందరు నోబిలుపాఠశాలకుఁ జదువుటకుఁ బంపించిరి. అచ్చట నాంగ్లము, పారశీకము చదువుచుఁ బదిమాసము గడపిరి. ఈతనిపసిబాలుని కుశాగ్రమతికి నివ్వెఱపడి నోబిలుదొర తనయింటికి నడుమనడుమఁ దీసికొనిపోవుచు నతనికిఁ బుస్తకములిచ్చి ఫలాహారములు పెట్టుచుండెడివాఁడఁట. ఇది యెఱిఁగి శ్రీరామకవితల్లిదండ్రులు క్రైస్తవమత వాసన వీని కెక్కడఁ గలుగునో యని యాచదువునకు స్వస్తిచెప్పించి యింటికిఁ గొనిపోయిరఁట.

క్రమముగాఁ బండితసాహాయ్యమునఁ గొంతసంస్కృతాంధ్రజ్ఞానము నార్జించి కవిత చెప్ప నారంభించినాఁ డీతఁడు,

12 వ యేఁట వ్రాసినను వీరి సోమలింగేశ్వరశతకము ప్రౌఢముగా నున్నది. ఆకాలమున శతావధానప్రదర్శనమునఁ బ్రసిద్ధి నందిన మాడభూషి వేంకటాచార్యులవారు నూజవీడున సంస్థాన విద్వాంసులుగా నుండిరి. ఈయన పేరుఁబ్రబిశ్వలు శ్రీరామకవి గారు తఱచువినుచుండెడివారు. వీరికిని శతావధానము చేయవలె నని సంకల్పము ప్రబలినది. సంస్కృతవిద్యాభ్యాసము గావింపవలె నని జిజ్ఞాసయు హెచ్చినది. ఒకనాఁటి తెల్లవాఱుజామునఁ దల్లిదండ్రు లెఱుఁగకుండ నూజవీటికిఁ బయనమయి వేంకటాచార్యులవారిని సందర్శించి వారి యాదరమున నొక యవధానము గావించెను. అప్పు డాయన యీకవికిశోరుని కవితాధారకు, మతినైశిత్యమునకు మెచ్చి "పదిరెండేడుల యీడునం గవితఁ జెప్పంజొచ్చి వ్యస్తాక్షరీ" ఇత్యాదిపద్యముతోఁ బ్రశంసించెను. వారికడఁ గొంతసంస్కృతభాషాజ్ఞానము సంపాదించి మరల నింటికి వచ్చి సాత్రాజితీవిలాసము, (యక్షగానము 14 వ యేఁట వ్రాసినది) పంచనృసింహక్షేత్రము, శుకరంభాసంవాదము, కృష్ణార్జునసంగ్రహము మున్నగు కొన్నికబ్బములు లల్లి 18 వ యేఁట వాగీపల్లి గీర్వాణవిద్యాపీఠమునకుఁ బోయి సాహిత్యగ్రంథములు, సిద్ధాంతకౌముది చదివి తనకవితకుఁ బాండిత్యపు మెఱుఁగు పెట్టెను.

తరువాత 'సెకండుగ్రేడుప్లీడరు' పరీక్షలో నుత్తీర్ణులై బందరున్యాయవాదిగాఁ బ్రవేశించిరి. బందరుపౌరులు నాఁడు

వీరి పాదములు వెండిపూలచేఁ బూజించి, బంగారుపూలచే శిరము నర్చించి పల్లంకి నెక్కించి బ్రహ్మరథము పట్టిరని విందుము. ఉద్యోగము చేసికొనుచు వ్యాఖ్యానరచనము గావించుచుఁ గవితారచనము. 1884 లో జిల్లాకోర్టు పట్టా పొంది యేలూరు 'సబార్డినేటుకోర్టు'లోఁ బండ్రెండేండ్లవిచ్ఛిన్నముగా నుద్యోగధర్మము నిర్వహించిన న్యాయవాది యీయన. శ్రీరామపండితుఁ డెంతధనసంపాదకుఁడో యంతదాత. పండితులకుఁ గవులకు నీయన యెన్నో సన్మానములు గావించె. కవులయెడ సహజముగ నుండునసూయాదిగుణములు వీరియెడఁ గనఁబడవు. సంగీతాభినయగ్రంథములు చాల రచించిన కళావిదుఁ డీయన. జ్యోతిశ్శాస్త్రమున మంచి ప్రవేశము. 1901 లో "శ్రావణమాస మధికమా- ఆషాఢమాస మధికమా ?" యను చర్చ రాజమహేంద్రవరమున జరిగెను. దీని పరిష్కరణమునకు ముప్పది పండితులేర్పడిరి. నాఁడు వీరి సిద్ధాంతమే నెగ్గిన దని పలువురు ప్రశంసించిరి. ఇదిగాక సంఘసంస్కరణము, మతాచారములు, ధర్మము, లౌకికనీతులు మున్నగు విషయములను గుఱించి వీరనేకవ్యాసములు వెలువరించిరి. 1880 సం॥లో 'కల్పవల్లి' యను పత్రిక ప్రకటించిరి. ఉపన్యాసము లిచ్చిరి.

అచ్చతెనుఁగున నిర్బంధము కలిపించుకొని యత్యంత మనోహరముగా నభిజ్ఞానశాకుంతలము నాంధ్రీకరించిన కవీంద్రు డీయన. మాలతీమాధవము, మహావీరచరితము, మాళవికాగ్ని

మిత్రము మొదలగునాటకము లెన్నియో యాంధ్రీకరించి ఘనత గాంచిరి.

వీరి కావ్యప్రపంచమున జిరస్థాయిగా నుండునది దేవీ భాగవతము. రసవిలసితముగా నున్నది "తెలుఁగునాఁడు". ఇది స్వతంత్రపుఁగబ్బము. ఇందలిపద్యములు స్వభావసిద్ధములు. మందునకు రెండు పొందుపఱుతును.

లేవకు 'లెండు లెం' డనిన లేచినవా రయిదాఱం డటాలునం
బోవరు పోవుచున్నలిచిపోదుము పోదుము త్రోయకుండటం
చీవరు నందు గేస్తు నలయింతురు పెండిలిలో సదస్యనం
భావనవేళఁ జూడవలె బాపనసాములసాము లన్నియున్.

నమ్మిన నమ్మకున్న నది నావశమా? జను లాడికొన్నవా
క్యమ్ములు నేనుఁ జెప్పెదభయంకడిరోపడకో, నియోగిలో
క మ్మనివార్యకార్యమటక మ్మవుఁగాని పరోపకార శూ
న్యమ్ములు స్వప్రయోజనపరాయణమ్ములు దలపోయ నిద్ధరన్.

చెళ్లపిళ్లకవి వ్రాసినట్లు లిక్కాని కవిత జనరంజకము, లోకానుభవ వ్యంజకము నైయున్నది.

అస్సే చూస్సివషే వొషే చెప్రడషే అస్లాగషే యేమిషే
విస్సా వజ్ఝులవారి బుజ్జినవ ఆవిస్సాయి కిస్సారుషే
విస్సం డెంబటివాడె? యేళ్లు వరిషే......
ఈపద్య మీయనిదే.

ఈయన పోతనవలె సహజపాండిత్యుఁడు. అతఁడు భాగవతము నాంధ్రీకరించిన నితఁడు దేవీభాగవతము నాంధ్రీకరించినాఁడు. ఈయన కవితాసంపన్నుఁడే గాక మోహనరూప సంపన్నుఁడు కూడ నని చూచినవారు చెప్పుదురు.

ధనము, రూపము, విద్య, వితరణము, వినయము, వివేకము కలిగిన యీ శ్రీరామపండితునకుఁ బుత్రు లాఱుగు రుదయించి పెంపొందుట యెంతటియదృష్టమో పరికింపుఁడు. కుమారులకు కేశవనామములను నామములుగా నుంచెను. శ్రీరామకవి సర్వథా ధన్యుఁడైన కవివతంసుఁడు. ఆంధ్ర దేవీభాగవతరచయితలగు శ్రీ ములుగు పాపయారాధ్యుఁడు, దాసు శ్రీరామకవి, తిరుపతి వేంకటకవులు, త్రిపురాన తమ్మనకవి తెలుఁగువారికి వందనీయులు.

# ఆచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మ

## ౧౮౬౪–౧౯౩౩

ఆఱువేల నియోగిశాఖాబ్రాహ్మణులు. సాంఖ్యాయన సగోత్రులు. తండ్రి బాపిరాజు. తల్లి నరసాంబ. జననము 1864. నిర్యాణము 1933. వీరిపూర్వులు గోదావరీమండలము లోని ఆచంటగ్రామమునఁగాఁపురముండెడివారు. సాంఖ్యాయనశర్మగారి తల్లిదండ్రులు నాగావళీ నదీప్రాంతములకు వెడలివచ్చిరి. కాఁగా వీరు విశాఖపట్టణమండల నివాసులు. గ్రంథములు: సుధానిధి (కావ్యము) మనోరమ (కావ్యము) పార్థపరాజయము,అవదాతకలభకము (స్వతంత్రనాటకములు) విక్రమోర్వశీయము, ఉత్తరరామచరిత్ర (ఆంధ్రీకరణములు) రహస్యదర్పణము, ఆంధ్రపద్యావళి మున్నగునవి. ప్రచురించిన పత్రికలు: సుజనప్రమోదిని, కల్పలత.

వేంకటరాయ సాంఖ్యాయన శర్మగారు మహోపాధ్యాయులని ఆంధ్రభీష్ములని కొనియాడఁబడిన ప్రసిద్ధపండితులు. వీరు పండితులుగాను, కవులుగాను, పత్రికాసంపాదకులుగాను, విమర్శకులుగాను, మహోపన్యాసకులుగాను తెలుఁగునాఁటఁ బేరు సంపాదించిరి. సాంఖ్యాయన శర్మగారు స్ఫురద్రూపి. ఆకారమున కనుగుణమగు ప్రజ్ఞ. ప్రజ్ఞకుఁ దగిన వాక్చాతుర్యము. ఈయన యుపన్యాసవేదిక నెక్కినచో నెట్టివాఁడైన కిక్కురుమనుటకు వీలులేదు. సమయస్ఫురణము, చాతుర్యము, పరేంగితజ్ఞత గల యుపన్యాసకులలో నీయన యగ్రేసరుఁడు. సమయోచితము సరసము నగుహాస్యము వీరిమాటలలో నుండి యెటటి

వారిని మద్గుల నొసఁగించెను. సాంఖ్యాయనశర్మగారి వాక్స్థాన మున నేయుచ్ఛ్రగహము లున్నవోగాని యీయన యంతయంద ముగాఁ బొందికగా మాటాడునారు. సరస సంభాషణమునకుఁ గూడ గొప్ప ప్రతిభ యుండవలయును. మహామహోపాధ్యా యులు పరవస్తు వేంకటరంగాచార్యులు, కొక్కొండ వేంకటర త్నముపంతులు మనోహరముగా భాషించువా రని వినుదుము. మంగళంపల్లి సర్వేశ్వరశాస్త్రి, బులుసు పాపయ్యశాస్త్రి మాటలలో ధ్వను లుపయోగించెడివారఁట. "అర్కశుష్క ఫలకోమలస్తనీ, పెద్దిభొట్లగృహిణీ విరాజతే" ఇత్యాది మహా వాక్యములకుఁ గర్తలగు పెద్దిభొట్లుగారు చాటూక్తిచతురుఁ డని ప్రసిద్ధి. నేఁడు చిలకమర్తికవి, చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి వేదము వేంకటరాయశాస్త్రి చతురభాషణులలోఁ బేరుమోసి నవారు. వీరిమాటలు లోకులు చెప్పుకొని యానందించుచుం దురు. సాంఖ్యాయనశర్మగారిసంభాషణముకూడ దేశప్రసిద్ధ మైనది. వీరిది పండితైకరంజకమైన వక్తృత్వమే గాదు. ప్రజా సామాన్యమునకు సబోధమగు మాటనేర్పు. పైని మన మను కొనినవారందఱును బండితపామరమనోరంజకముగా మాటాడు వారే.

సాంఖ్యాయనశర్మగారు కవిత్వము వ్రాసెను. చిత్రలేఖ నము నేర్చెను. సంగీతము నెఱిఁగెను. నాట్యశాస్త్రము తెలిసి కొనెను. పదార్థవిజ్ఞాన రసాయనశాస్త్రములు, భూవృక్ష క్రిమి

కీటక ఖనిజతత్త్వము, ప్రాచీనాధునాతన హైందవరాజ్యాంగ విశేషములు చక్కఁగాఁ బరిశీలించెను. వీరి ప్రజ్ఞాదర్పణమునఁ బ్రతిఫలింపనికళ లేదు. కుశాగ్రబుద్ధియగుటచే సంస్కృతాంధ్రములలోఁ జిన్ననాఁటనే గొప్పసాహిత్య మలవఱచుకొనెను.

క్రీ. శ. 1880 ప్రాంతమునఁ దెలుఁగుదేశమున వ్యాప్తములోనున్న ఆంధ్రభాషాసంజీవని (కొక్కొండ వేంకటరత్నము గారిచేఁ బ్రకటితము) మందారమంజరి, ప్రబంధకల్పవల్లి మున్నగుపత్రికలు చదువుచుండుటచే సాంఖ్యాయనశర్మగారికిఁ బత్రికాప్రచురణోత్సాహము చిన్నతనముననే కలిగినది. నాఁటికాయన వయస్సు పదునెనిమిదియేండ్లకు లోఁబడియుండును. అప్పుడు 'సుజనప్రమోదిని' యను పేరితో నొకమాసపత్రిక సతువ నారంభించిరి. దాని తొలిసంచిక 10-6-1881 సం॥ నాఁడు వెలువడినది. 'సుజనప్రమోదిని'తో శర్మగారి నాంధ్రదేశము కొంచెము తెలిసికొనినది. 1885 లో వీరు శతఘంటకవిత్వము చెప్పిరఁట. ఆపద్యము లలభ్యములు. ఆంగ్లభాషాకృషి సేయునెంచి 'మిడిల్‌స్కూలు' పరీక్షకుఁబోయి రాజధానిలోఁ బ్రథములుగా నెగ్గిరి. తరువాత న్యాయవాది పరీక్షకుఁ జదివి కృతార్థులై పార్వతీపురము మునసబుకోర్టునఁ బనిచేసిరి. లౌకికోద్యోగము చేయుచున్నను సాహిత్యవ్యవసాయము వీడక గ్రంథరచనము చేయుచు 1892 లో 'ఆంధ్రపద్యావళి'యను పేరఁ దమఖండరచనల నొకసంపుటముగా వెలువరించిరి. తరువాత 'రహస్యదర్పణము'

ముద్రించిరి. అంతదదృశ్య ప్రపంచరహస్యములు, క్రిమికీటక పక్షిజంతు యాత్రాదిరహస్యములు మొదలగువానిపై నపూర్వ పరిశోధనము కలదు. విక్రమోర్వశీయము, ఉత్తరరామచరిత్రము భాషలోనికిం బరివర్తించిరి. వీని కంతప్రశస్తి రాలేదు. 1903లో 'కల్పలత'యను విజ్ఞానవిషయక మాసపత్రిక నెలకొల్పిరి. ఆక ల్పలత రెండేండ్లలో యశోలతయై యాగిపోయినది. మరల 1919 లో దాని లేవదీసి కొంతకాలము నడపిరి.

శర్మగారు తెలుగునం జరిగిన యెన్నోమహాసభలకు ఆధి పత్యము వహించిరి. 1923 లో గుంటూరుమండలమునందలి 'నందూరు'న జరిగిన యాఱవ యాంధ్రసారస్వతసభకు వీరధిప తులు. ఆపరిషత్తునందే వీరిని మహోపాధ్యాయ బిరుదమున సత్కరించిరి. 1924 లో ఆంధ్రసాహిత్యపరిషత్రయోదశవార్షి కోత్సవమునకు వీరు సభాపతులు. 1929 లో దెనాలియందు జరిగిన ప్రథమాంధ్రనాటక కళాపరిషత్తునకు శర్మగా రాధ్య క్ష్యము సభ్యప్రార్థనముపై నంగీకరించి యద్భుతముగా సభను నిర్వహించిరి.

ఈవిధముగా మహాసభల కధ్యక్షులై, మహోపన్యా సకులై మహోపాధ్యాయులు డనిపించుకొనిన సాంఖ్యాయన శర్మగారి కవితా విశేషము లింకం జవిచూతము. ఈయన కవిత రసస్ఫోరకము. సరళపదభరితము.

పట్టిన దెల్లం బైడియగు భంగిని పల్కినపల్కు పద్యమై
యుట్టిపడంగం జెప్పినది యొప్పిన వేదము కాంగ పల్కుథల్

కొట్టినపిండిగాఁ గవితఁగూర్చిన ధన్యుల లోకమాన్యులన్
బుట్టను దిక్పుతం బొడమి పూజ్యతగాంచినవారి నెన్నదన్.

"సుధానిధి"

ఆటవెలఁదు లున్న తేటగీతములున్న
మనసు కరఁగిపోవు మంచుపగిది
ఆట లేక తేటపాటయు లేకున్న
వెలఁదు లున్నఁ జాలు లేవరాలు.

"ఆటవెలఁదులు తేటగీతములు"

మగువలకెగాని చన్నాలు మగల కెందు
పొడమ వనుమాట లన్నియు బూటకములు
పురుషు లేఁకమీఁద స్తన్యంబు వొడమునట్లు
రొమ్ము సవరించుకొనుట కార్యమ్ముకాదె ?

"సంఘసంస్కరణము"

"బహిస్సర్వాకార ప్రవణరమణీయం వ్యవహరన్" అను భవభూతి శ్లోకమున కీకవియాంధ్రీకరణపుమచ్చు నిచ్చినచో వీరిశక్తి తెలియఁగలదు.

మన సెటులుండనీ, పయికి మాటలఁ జేఁతలచేత లోకరం
జన మొనరింపుచున్ దనరుస్వల్పపుదోషములైన వాఁచుచున్
జనులను మోసపుచ్చి యొరుచాతుర్వన నేర్పరితాఁ దటస్థుఁడై
తనపనిచక్కఁబెట్టుకొనుఁ దాల్చును బిమ్మటమానవుం ద్రయున్

# పానుగంటి లక్ష్మీనరసింహరావు

## ౧౮౬౫–౧౯౪౦

మధ్వమతస్థులు. తండ్రి: వేంకటరమణార్యుఁడు. తల్లి: రత్నమాంబ. నివాసము. రాజమహేంద్రవరము, పిఠాపురము. జననము 1865 సం. నిర్యాణము: 1-1-1940 సం. రచితగ్రంథములు: సారంగధరచరిత్ర, వృద్ధవివాహము, రాధాకృష్ణ, నర్మదాపురుకుత్సీయము, సరస్వతి, దుష్టప్రధాని, ఆనందనాథ, కల్యాణరాఘవము, కంఠాభరణము, విజయరాఘవము, కోకిల, విప్రనారాయణచరిత్ర, విచిత్రసమావేశము, విచిత్రమరణము, బుద్ధబోధసుధ, వీరమతి, పూర్ణిమ, ప్రచండచాణక్యము, (ఇత్యాదినాటకములు.) హాస్యవల్లరి, పతనము, మంజువాణి, జగన్నాథమూర్తి, మోసము, జలజ, సాక్షి (6 భాగములు)

సాక్షివ్యాసములు చదువనియాంధ్రు లుండరు. జంఘాల శాస్త్రిగంభీరోపన్యాసము, వాణీదాసుఁడు, కాలాచార్యుఁడు, బొఱ్ఱయ్యసెట్టిగారల మాటలును తెలుఁగువా రెల్ల నెఱిఁగినవే. వారి నాటకములమాట యటుండనిచ్చి సాక్షివలనఁ బానుగంటి వారిని దలఁచుకొని నవ్వుకొనుచుందుము. ఆంధ్రపత్రికాపాఠకులు సాక్షివ్యాసములకొఱకుఁ గాళ్లు విఱుగఁద్రొక్కుకొనినదినము లెన్నియో యున్నవి. కాని పంతులుగారి షష్టిపూర్తిసందర్భమున కొకయాంధ్రుఁ డేని నడుముగట్టినపాపానఁ బోలేదు. సాక్షి యాంగ్లములోని spectator అనుగ్రంథమునకుఁ దెలిసికొనఁ జాలనిఛాయ యని చెప్పుదుముగాక! అయిననేమి ?

తెలుఁగుజాతికి 'సాక్షి' యొక యుజ్జ్వలజ్ఞానదీపము. మన సంఘమును, మనజాతిని, మన వాఙ్మయమును, మన దురాచారములను, మెత్తమెత్తగా నెత్తిపొడుచుచు సంస్కరింపఁజూచిన మహాగ్రంథము 'సాక్షి'

లక్ష్మీనరసింహారావుపంతులుగారు స్త్రీలు- మతము- నాగరకత- వేదాంతము. విద్యావిధానము- రాజకీయములు- మున్నగు విషయములను గూర్చి యెక్కువ చర్చింతురు. పంతులుగారికి దేశభాషయం దింతింత యనరాని యభిమానము. దేశీయభాషలో నుపన్యసింపలేని యధ్యక్షునిగూర్చి పంతులుగారు ప్రకటించిన యాగ్రహ మసమానము. ఇది 'స్వభాష' యను (సాక్షి మూఁడవసంపుటము) వ్యాసమునఁ గాననగును. స్నానసంధ్యాదివిధులను వదలివేయుట భారతీయులకు ధర్మము కా దని చెప్పు ప్రాచీనాచారపరాయణులు శ్రీ పంతులుగారు. వారి వేదాంతోపన్యాసములను బట్టిచూచిన వారద్వైతవాదులు. కాని వస్తుతః వీరు ద్వైతమతస్థులు. నేఁటి విద్యావిధానమున దైవభక్తికి సంబంధించిన గ్రంథములు లేవనియుఁ గనుకనే విద్యార్థులలో నాస్తికత ప్రబలుచున్న దనియు వీరు పలుమారు వ్రాయుచుందురు. రాజకీయవిషయములను గూర్చి యెన్నికలనుగూర్చి వ్రాయుచు గాంధిగారి సిద్ధాంతములను దాము వివేకించుచున్నట్లు లిఖించిరి. సాక్షిలో 'తోలుబొమ్మ

తోటి వ్యాసము ... వీరి జానపదవిమర్శవివేకిత వెల్లడి యగుచున్నది.

పానుగంటి పంతులుగారు శబ్దవైచిత్రి నలదిగాని. ఆంధ్ర వచన రచనలో వీరొక క్రొత్తదారి త్రొక్కిరి. కందుకూరి వీరేశలింగము పంతులుగారు గద్యతిక్కనయేగాని యావిమర్శము వేరు. చిలకమర్తికవి ప్రసిద్ధవచనరచయితయే గాని యదియును వేరే. పానుగంటివారి రచన మదియొక విలక్షణమైనది. వీరు వ్యావహారికమునకు దగ్గఱగ నుండు గ్రాంథికము వ్రాయుదురు. ప్రతిపదము పరిహాసగర్భితము. ఆక్షేపణ భరితము. చెప్పినదే మార్చి మార్చి భంగ్యంతరముగాఁ జెప్పుట వీరి రచనలోఁ క్రొత్తదనము. చదివినకొలఁదిని జదువవలెనను కుతూహలము పుట్టించు రచనమే రచనము. అది పానుగంటికవి సొమ్ము. విషయము గప్పిపుచ్చుచుండ, నసుగుపుట్టించుచుండ వేలకొలఁది నిదర్శనములఁ జూపుచు వ్రాయుటలోఁ బానుగంటివారిదే పైచెయ్యి. పాఠకునకొకవిధమైన యుత్సాహము చిత్తసంస్కృతి యావేశము గలిగింపఁజేయుట కీమన రచన యొక్కటైనది. వీరికిఁ బాశ్చాత్య వాఙ్మయమునఁ గూలంకషమైన ప్రజ్ఞ. పంతులుగారు భాషలోనే గాక వ్యవహారమునఁగూడ దిట్టమైన ప్రజ్ఞ గలవారు. కొంతకాలము 'అనెగొంది' యాస్థానమున, కొన్నినాళ్లు ఉర్లాము ప్రభుత్వమున, కొంతకాలము లక్ష్మీనరసాపురము సంస్థానమున మంత్రిగాఁ బనిచేసిరి. తరువాతఁ బిఠాపురసంస్థానప్రభువులు

వీరి వైదుష్యమున కానందించి చివరివఱకు నెలకు 116 రూప్యములనిచ్చుచు సన్మానించిరి. పాశ్చాత్యభాషాప్రవీణులయ్యు నాంధ్రభాషాసేవ యమూల్యముగా నొనరించి తరించిన పండితు లీయన. అనుకరణము లీయన యామోదింపలేదు. అనువాదములు గావింపలేదు. 'ఆంధ్రి'ని మఱవలేదు. వీరు తీసికొనిన గాథలు పౌరాణికములు. కావ్యచిత్రణములు మాత్రము నవీనములు. వ్యాసములలోనే కాదు నాటకములలోనే కాదు హాస్యమునకుఁ బ్రాధాన్యము. సాక్షిలోని వ్యాసములకు హాస్యరస మతిమాత్ర మైనను బ్రమాదము లేదు. కాని వీరి కొన్ని నాటకములలోనిహాస్యము ప్రధానరసతిరోధానము చేయుచు నత్యధిక మైనది.

శ్రీ లక్ష్మీనరసింహము పంతులుగారి నాటకములలోని పద్యములు బండివానినుండి పండితునివఱకుఁ బాడుకొని యానందించుచుందురు. నాటకరచనకంటె సాక్షివ్యాసములతోఁ బానుగంటివారికి గొప్పపేరు వచ్చినది. సాక్షివ్యాసములకంటె నాటకరచనములో నరసింహారావుపంతులుగారిని రసవిదు లెల్ల మెచ్చుకొనిరి. పానుగంటివారి నాటకములకు కూడ నరసింహముగారు 'నాంది' వ్రాయుట యొక యాచారము. పంతులుగారాంగ్లకవిశేఖరుఁడగు 'షేక్సిపియరు' వ్రాసిన యన్ని నాటకములు వ్రాయవలె నని సంకల్పించి యొకటిరెండించుమించులోఁ దమ సంకల్పము పూర్తిచేసికొనిరి. వానిలో నయి

ధాలు నాటకములకు సఖండప్రశంస వచ్చినది. 'రాధాకృష్ణ' వీరి నాటకములలో నాయకరత్నము. దానియందు వీరి కవిత పండినది.

మెఱుఁగుఁగుండలముల మిసమిసల్ గండభా
  గములపై నట్టిట్టు గంతులిడఁగ
రంగారుకటియందు బంగారు పుట్టంబు
  చిఱుబొజ్జయందు కౌంచెముగ జాఱఁ
బవపూరణమున జవ్వజవ్వని లేఁత
  బుగ్గలు బూరెలై పూరటిల్ల
నిగనిగల్ గలగుజ్జసిగ నున్న శిఖిపింఛ
  మొయ్యారమునఁ దలయూఁపు చుండ

నుత్తమోత్తమజన్మమై యొప్పుమురళి
నధరమున మోపి జలుజల్లుమనఁగ జగతి
గానమును జేయుకల్యాణకాంతు లొలుకు
నీమువదనంబు జూపింపు నీరజాక్ష !

ఈపద్యమునఁ గవికి వేణుగానలోలుని విశ్వరూప మగపడినది. ఈనాటకకర్తకు గోపాలబాలుని మురళీరవముపై నభిమానము. ఒక్కచో రాధ కృష్ణు నిట్లు ప్రార్థించినది.

సరససంగీత మాధురీ సాధురీతి
నింక నొకసారి మురళి వాయింపుమయ్య

త్వన్ముఖామృతపూరంబు ద్రావుదాన
ఘనఘనాంబువు చాతకకాంతవోలె.

సుమధురము సుప్రసన్నము నగుభాషలో నాటకపద్యములు వ్రాయునేర్పు పానుగంటి లక్ష్మీనరసింహరావునికే చెల్లినది. తరువాత చిలకమర్తి లక్ష్మీనరసింహరాయునికే తగినది. అన్యుల శాశైలి యసహజము. వీరి నాటకములలోని సంభాషణములు సన్నివేశములు చాల సరసముగ నుండును. ఒకొ్కక్క విషయ ముద్రేకముతో రచింతురు. అట్టి సందర్భములయందు కొంత విరసముగనుండుటయుఁ దటస్థించును. పానుగంటికవి సీసములు విశేషించి గీతములు వ్రాయుచుండును. ఆగీతములువచనమువలె నడచుట వీరి కభిమతము. ప్రతిపద్యమున నుపమాన ముండి తీరును. ఆయుపమలలో నీచాధికభేదములు వీరు పాటింపరు. అందుచలకే వీరి పద్యములు ఖండితపామరరంజకములు. ఒకొ్క కచో వీరి హాస్యరసము వట్టోడి పరిహాసాస్పద మగుచుండుట యుఁ గలదు. రానురాను సాక్షివ్యాసములలో నీగుణము మన కుఁ గనుపించును. కల్యాణరాఘవము, పట్టభంగరాఘవము, వనవాసరాఘవము, విజయరాఘవము, రాధాకృష్ణ, సారంగ ధర, సరోజిని, నర్మదాపురుకుత్సీయము. విప్రనారాయణ ఇత్యా దులు పౌరాణికములు. ప్రచండచాణక్యము, చూడామణి ఇత్యాదులు చారిత్రకములు. కోకిల, సరస్వతి, వృద్ధవివాహము. మాలతీమాల, రాతిస్తంభము ఇత్యాదులు కల్పితములు.

వీరి 'కంఠాభరణము' నాటకవాగ్దేవతకుఁ గంఠాభరణము. వీరికి బౌద్ధవాఙ్మయమునఁ గలయభిరుచికి "బుద్ధబోధసుధ" నాటకమే సాక్షి.

పానుగంటికవి చాటూక్తిచతురుఁడు. 1922 లో నాంధ్రసాహిత్యపరిషదేకాదశవార్షికోత్సవసభకు వీరి నగ్రాసనాధిపతులుగా నెన్నుకొనిరి. అప్పు డుపన్యాసారంభమున నిట్లు చెప్పిరి. "నేను పండితుఁడను గా నని యీయూరివా రెఱుఁగుదురు; పై గ్రామములవా రెఱుఁగుదురు. సాహిత్యహీనతలో జగమెఱిఁగినవాఁడను గాని సాధారణుఁడను గాను. ఇట్టి నన్నుఁ బరిషత్తువా రేల యెన్నుకొనవలయునో నాకుఁ దెలియదు. తెలిసినవిషయ మేమియో యంతకంటెఁ దెలియదు. వెనుక జరిగిన పదిపరిషత్సభలకుఁ బండితుల నెన్నుకొంటిమిగదా, యీసారి యపండితు నెన్నుకొందము. ఇంతలోఁ జెడిపోవున దేమున్నదని యూహించి మార్పుకొఱకై నన్నెన్నుకొని యుందు రేమో? ఎటులైననేమి, అవిలంఘ్యమైన మహాజనులయాజ్ఞ తులసీదళమువలె శిరమున ధరించి యిటనిలువఁబడితిని." ఈసంభాషణ మెంత యభిప్రాయగర్భితముగా నున్నదో చూడుఁడు!

లక్ష్మీనరసింహారావుగారు 'స్వీయచరిత్ర' వనవాసరాఘవరచనమువఱకు వ్రాసికొనిరని తెలిసినది. అది సంపూర్ణము కాకుండఁగనే వారు గతించుట యాంధ్రుల దురదృష్టము.

—

# శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి

## ౧౮౬౬

వెలనాటి వైదికబ్రాహ్మణులు. కౌశికగోత్రులు. ఆపస్తంబ సూత్రులు. తండ్రి: వేంకటసోమయాజి. తల్లి: వేంకటసుబ్బసోమిదమ్మ. జననము: 29-10-1866 సం॥ (శాలివాహన శకము పునర్వసూనక్షత్రమిధునలగ్నము రాత్రి ౪ గడియలకు) జన్మస్థానము: ఎర్నగూడెమునొద్ద 'దేవరపల్లి'. నివాసము: రాజమహేంద్రవరము. విరచితగ్రంథములసంఖ్య ౧౫౦. అందలి ముద్రితములగు కొన్నిగ్రంథములు. ౧ బొబ్బిలియుద్ధనాటకము ౨ వేణీసంహారము ౩ కలభాషిణి ౪ రాజభక్తి ౫ భోజరాజ విజయము ౬ శ్రీనాథకవిరాజీయము (నాటకములు) ౭ గౌతమీ మాహాత్మ్యము ౮ సత్యనారాయణోపాఖ్యానము ౯ గజాననవిజయము ౧౦ శ్రీకృష్ణకవిరాజీయము ౧౧ సావిత్రీ చరిత్రము (పద్యకావ్యములు) ౧౨ సంస్కృతకవి జీవితములు ౧౩ కాళిదాస విలాసము ౧౪ తెనాలి రామకృష్ణచరిత్రము (వచనము) ౧౫ శ్రీకృష్ణమహాభారతము (18 పర్వములు) ౧౬ గణేశపురాణము మున్నగునవి.

“నే నాంధ్రంబునఁ గించి న్న్యూనసంబుగ నూఱుకృతుల నున్నతి నొందం గా నొనరించితి లోకము వానిం జవిచూచి మెఱుఁగు బలుకఁగనేలా !” అని పదునెనిమిది పర్వములతో నిండిన భారతమంతయు నొక్కచేతిమీఁదుగ రచించి వెలువరించిన ధన్యులు కృష్ణమూర్తిశాస్త్రిగారు. భారతాంధ్రీకర్తలగు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు మహామహోపాధ్యాయులు,

కళాప్రపూర్ణులు. కవిరాజులు. కవిసార్వభౌములు. శ్రీపాదవారి శతాధికగ్రంథ కర్తృత్వము కొందఱకాశ్చర్యము కలిగించుచున్నను భారతాంధ్రీకరణము మాత్ర మాశ్చర్యానందములు కలిగించిన దని చెప్పవచ్చును. వీరియాంధ్రీకృతి యథామాతృకముగా నడచినది. కవిత్రయాంధ్రీకృతమగు మహాభారతములో ననువదింపక విడిచిన భగవద్గీతాది ఘట్టములనుసైతము సాహసముతో మనశాస్త్రిగారు తెనిఁగించిరి. వీరు నన్నయతిక్కనలను మించి యాంధ్రీకరించితినని వ్రాసిరి. విమర్శకులు కొందఱు కవిత్రయభారతములోని యాంధ్రీకరణము మఱియొక యాంధ్రగ్రంథమున నరయఁగరాదని చెప్పుచుందురు. విమర్శనములు నిలుచునవి కావు. కాని శాస్త్రిగారు భారతపీఠికలో నీవిధముగఁ జెప్పుచున్నారు.

నన్నయ తిక్కనాది కవినాథులకన్నను మిన్నగాఁ దెలుం
గు న్నుడువంగలాఁడ నధికుండను నేనని కాదు, గ్రంథమం
దున్నరసల్ కొలందులను దోఁచునటంచనికాదు వెండియుం
జన్నట భారతేచ్ఛకనుబట్టినచాపల మంచు నెంచుఁడీ !

శ్రీకృష్ణ మహాభారతము కవిత్రయభారతముతోపాటు సుస్థిరముగా నుండుననుటకు సందేహము లేదు. భారత మాంధ్రా యూరు మాటలతోఁ బనికాదు. ఛల్లూరిపుల్లాట్టి కట్టి వలయును. ఏదో యొకమహోన్నత కార్యము తలపెట్టినపు డనేకాధాకంతములు తగులుచుండును. అనేకాశయము లిట్టి పీడించుచుండును.

"ఆదరణీయసారవిశారదగతిస్ఫురణముగా, నాచితీపో షణము చేసికొనుచుఁ గవినాథులగు నన్నయాదులు మున్నె మహాభారత మనువదించి యాంధ్రకవితాలోకమున ననశ్వర యశస్సు నార్జించికొనిరి. వాగనుశాసనుఁడగు నన్నయభట్టారకు నంతవాఁడు కూడ భారతాంభోధిని తుదముట్టనీఁదలేఁడయ్యె. ఒక వేళ, మన మీగ్రంథము పూర్వసుకృతబలమునఁ బూర్తిచేసి నను గవిత్రయభారతమువలె రసజ్ఞామోదము కలిగించునో? లేదో?"

ఇత్యాదిప్రశ్నము లీతద్గ్రంథరచనారంభమునఁ బొడమి కవిమనస్సును గలఁచివైచుట సహజము. ఇది యననేల? ఏమా హోద్యమ మందైన నిట్టిప్రశ్నములే పుట్టి వ్యగ్రోత్సాహమును గొంత భగ్న మొనర్చుచుండుట తెలియును. ఇట్టిస్థితిలో నీసంశయ ములకు వెనుకదీయక ధైర్యస్థైర్యములతో నక్షయదీక్షతో మహాభారతమంతయుఁ బదునైదేండ్లలో ననువదించి చరితార్థు లైన కృష్ణమూర్తిశాస్త్రిగారు వజ్రసంకల్పులు. అరణ్యపర్వరచ నాకాలములో నీకవిరాజున కెన్నియో యిడుములు కలిగినవి. ద్రోణపర్వము వ్రాయుచున్నపుడు వీరవికి స్మరణీయమగు నొక విషాదఘట్టము పాటిల్లినది.

అతికష్టంబుగనిట్లు కాలమును ద్రోయం జాలి యున్న ప్పుడుకా
గృహనిర్మాణమునూనకొల్లాయిరుమూఁడుపర్వములఁ పూర్తిచే

సీ. ద్రోణంబు దొడంగి యార్జునివధంబుం వ్రాయుచున్నప్పుడా
సుతునిం జెండవహాత్రోసి మేనుతయటంచుం ఫాల్గునుం డేసిచేన్
అవి తెలింగింపనామనమునం దొరకసందియ మావహిల్లె న
య్యది నన నాసుతా! యనకహాసుత! యంచుఁ దెలుంగు సేయఁగా
మొదలిడినాఁడ; నా సుతుఁడు పొంతవసింపఁగ రాఁగ, నిప్పు డి
క్పదము ననుండ కంచు నెడఁబాపుదునైనదిగుల్మదింబడెన్.

అని యిట్లు సంశయించుచు గ్రంథరచనము చేయుచుండ దైవ వశమున నీభారతకవి కుమారరత్నము "సుదర్శనసుధి"యను నతఁడు స్వర్గతుఁ డయ్యెను. ధైర్యశాలియగు కవిరాజు గర్భశోకమును దిగఁద్రావి భారతమును మరల వ్రాయ మొదలిడెను.

కృష్ణమూర్తిశాస్త్రిగారి భారతమునకు ముక్త్యాలసంస్థాన ప్రభువు శ్రీరాజా వాసిరెడ్డి చంద్రమౌళీశ్వర ప్రసాదరావు బహద్దరు రాజరాజనరేంద్రుఁడు, పాలకొల్లు వాస్తవ్యులు, వణిగ్వర్యులగు శ్రీ రేపాక సత్యనారాయణమూర్తి, శ్రీ చందూరి నారాయణరావుగారలు భీష్మద్రోణపర్వములు, కర్ణశల్య సౌప్తికస్త్రీ పర్వములు మాత్రము కృతినొంది స్వర్ణాభిషేకము చేఁ గవిగారిని గారవించిరి.

పదునెనిమిది పర్వములు నొక్కచేతిమీఁదుగా వ్రాయుటయేగాక, యవి యన్నియు నచ్చుపడ, ముచ్చటగ జూచుకొనఁగలిగిన శ్రీపాదకవిరాజుజాతకము శ్లాఘనీయము. సంస్కృత మహాభారతము నన్నయభట్టారకాద్యాంధ్ర మహాకవిత్రయాం

ధ్రీకృతమైనపిమ్మట మరల దానిని పద్యరూపముగా ననువదింప సాహసించి పరిపూర్ణముగాఁ గృతార్థులైనవారు వీ రొక్కరే. ఆంధ్రవ్యాసులని పొగడఁబడిన కీ. శే. ఆకొండి వ్యాసమూర్తి శాస్త్రిగారు 'ఆంధ్రమహాభారతనవనీత' మను పేరితోఁ బదు మూఁడుపర్వములనను వదించిరి. అం దాదిపర్వముమాత్ర మిటీవల నచ్చునకు వచ్చినది. శ్రీ తాడూరి లక్ష్మీనరసింహాము పంతులుగారు భారతాంధ్రీకరణమునకుఁ దొడఁగి విరాటోద్యోగాదిపర్వములు కొన్నిమాత్రము తెనిఁగించినట్లు వినుకలి. అదియు ముద్రితమైనట్లు కనఁబడలేదు. ఇందుమతీపరిణయము (అజచరిత్ర) రచించిన ముత్తుకుమల్లి నృసింహకవికి బితామహుఁడు మాధవకవి "అభినవభారతము" అను పేర మిశ్రకావ్యముగా భారతము నాంధ్రీకరించె ననియు నం దాదిపంచకము మాత్రము మిగిలి తక్కినది తాడిపర్తిగ్రామములోఁ దగులఁ బడినదనియుఁ దెలియుచున్నది. కవిత్రయభారతము తరువాత నీకవిరాజు భారతమే సంపూర్ణముగా రచింపఁబడి సమగ్రముగా ముద్రణమునకు వచ్చినది. నన్నయభట్టారకుఁడు గంటము పట్టి భారతరచనకుఁ గడఁగిన రాజమహేంద్రవరముననే యీకవిసార్వభౌముఁడు కలము పట్టి భారతమును బూర్తిచేయుట కడుంగడు మెచ్చుకొనఁదగినది. కృష్ణమూర్తిశాస్త్రిగారికి షష్టిపూర్తితోపాటు భారతరచనాపూర్తియు నగుట మఱియు బ్రశంస్యము. ప్రాచీనాంధ్రభారతముతో శ్రీకృష్ణమహాభారతముకూడ నఖిలాంధ్రజనమనోరంజన మొనరించుఁగాక !

మొదటినుండియు వీరికి శ్రీనాథునిపై నభిమానము మెండు. కవిత్వములో శ్రీనాథునిధోరణి పట్టువడకున్నను, జీవితములో శ్రీనాథునిజీవితము కొంతవఱకు నీకవిరాజులో నున్న దని యీపద్యము తెలుపును.

గౌతమీమాహాత్మ్యకర్తకంఠముఁ జుట్టు
కొనియుండ నేగదా ఋణముచిలువ
కవిమిత్రమే నెల్లఁ జివికించె నేగదా
యప్పులవారి వాక్యాయుధములు
శ్రౌతి మాన్యక్షేత్రసమితి కొదువఁ బెట్టఁ
బడెఁగదా వృషల సంభక్తనియొద్ద
అష్టశతావధానాధ్యున కివ్వాడు
చేరియున్నదిగదా నీరసంబు

పేట లంకెలపాట లీపాటుదెచ్చె
మాలపుర్వ్వలపాలయ్యె మఱిపొగాకు
అప్పు ముప్పదివేలరూప్యంబు లింక
నెట్లు దీర్చెదు శ్రీపాదకృష్ణమూర్తి.

ద్వితీయ శ్రీనాథుఁ డని కృష్ణమూర్తిశాస్త్రిగారిని మనము ప్రశంసింపవలయును. కవిరాజ కవిసార్వభౌమాదిబిరుదములం దాల్చుట స్వర్ణాభిషేకముఁ బడయుట యివి యిందులకుఁ దార్కాణ. అతనివలె నీతఁడును లంకవ్యవసాయముచే నప్పుల

పొలై పై పద్యము వ్రాసికొనెను. "శ్రీనాథకవిరాజీయనాటకము" దీనిని బలపఱుచును.

రాజమహేంద్రవరమున కవిసార్వభౌమసన్మానసభ యొకటి యేర్పాటుచేయఁబడినది. ఆసభకు యాజమాన్యము వహించిన శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు తాము స్వయముగాఁ గృష్ణమూర్తిశాస్త్రిగారి డాకాలున 'గండపెండేరము' తొడిగి తమ సహృదయతను వెల్లడించుకొనిరి. ఏతత్సభాంతమున శ్రీపాదకవి

నా కీరిచ్చినగండపెండెర మిలన్ నాస్వత్వ మేనాఁటికిం
గాకుండన్; న్వినుఁడేను ప్రాణములతోఁ గన్పట్టునందాఁకనా
డాకాల న్విలసిల్లు నప్డు చెడకుండన్, దీని నాంధ్రావనీ
ప్రాకామ్యంబగు"యూనివర్సిటీ"వహింపం జెల్లు స్వత్వంబుగన్.

అని చెప్పి యా 'గండపెండేరము' ఆంధ్రవిశ్వవిద్యాలయమున కర్పింప వాగ్దాన మొసంగిరి. ప్రాచీనకాలమునఁ బెద్దనాది కవి పితామహులు వడసిన యిట్టి మహామహితసన్మానము లిప్పుడీకవిరాజు పొందుట యానందవిషయము.

మఱియు నీకవిరాజు స్వదేశసంస్థానములలోఁ గొన్నిచోట్ల శతాష్టావధానములు గావించి సముచితముగా సన్మానితుఁడయ్యె. బంగాళారాజధానిలోని 'మయూరభంజి' యను పట్టనము (ఒఢ్రభుమన దీని మహారాజులు మనుదురు) నకుఁబోయి

యా సంస్థానాధీశు శ్రీమాల సంస్కృతమున శతావధాన మొనరించి బహూకృతిఁ బడసివచ్చిరి.

బాలాత్రిపురసుందరీదేవతోపాసకుఁ డగుటచే నీకవివరుఁ డనిన వాక్కు తప్పక కొన్నినాళ్ళు జరిగెడి దని చెప్పికొనిరి. కృష్ణమూర్తిశాస్త్రిగారు పత్రికాసంపాదకులై కొంతపేరు సంపాదింపఁగలిగిరి. 'కలావతి' యను ముద్రణాలయమును దొలుత మదరాసులో నెలకొల్పి పిమ్మట దానిని రాజమహేంద్రవరమునకు మార్చి యవిచ్ఛిన్నముగ సుమారు పదిసంవత్సరములు దానిని నడపిరి. ఆముద్రణాలయమున 'గౌతమి' యను తెలుఁగుమాసపత్రిక 1908 లో నారంభించిరి. అది యొకయేఁడు నడచినది. "మానవసేవ," "వందేమాతరమ్" అను పత్రికలను గొన్నినాళ్లు సంపాదించిరి. వీరి 'వజ్రాయుధము' వ్యావహారికాంధ్రముపై దండయాత్ర సాగించినది. ఈరీతిగాఁ బత్రికాసంపాదకులై, శతాధికగ్రంథకర్తలై, యావద్భారతాంధ్రీకర్తలై, కవిరాజులై, కవిసార్వభౌములై కళాప్రపూర్ణులై, మహామహోపాధ్యాయులై కనకాభిషిక్తులై శాశ్వతకీర్తి సంపాదించుకొనుచున్న శ్రీపాదకవి శిలావిగ్రహము రాజమహేంద్రవరమునఁ బ్రతిష్ఠింపఁబడినది. మహాభారతకృతికర్త సమగ్రజీవితము వ్రాసినచో మఱియొక మహాభారతము.

# కూచి నరసింహము

## ౧౮౬౬—౧౯౪౦

తల్లి: పుల్లమాంబ. తండ్రి: వెంకనార్యుఁడు. జన్మస్థానము: మంచెనపల్లి (కృష్ణాజిల్లా.) నివాసము: పిఠాపురము- జననము 17-12-1866 సం. నిధనము 7-10-1940 సం. గ్రంథములు: రూపలత, వనవాసి, గౌరాంగచరిత్ర (2 భా) తెలుఁగుల్లాసుతమాషా, ఆగ్నేయాశుగములు, గ్రాంథికభాష గ్రామ్యభాష, రామకృష్ణపరమహంసచరిత్ర. ఆత్మనివేదనము, నానావిషయక విరచనములు. వివేకానందస్వామి పాణిణోపన్యాసచతుష్కము, భ్రమప్రమాదప్రహసనము, ఆదర్శ సుఖజీవనము, ఇత్యాదులు.

రాత్రి పదిగంటలవేళ సాలువఁ గప్పికొని చేతికఱ్ఱ పుచ్చుకొని మెల్లమెల్లఁగ విద్యార్థులు చదువుకొనుగదులకడకు వచ్చి యెవరు చదువుచుండిరో, ఎవరు చదువుటలేదో బారెఁడుదూరమున నుండి పరిశీలించి, మరునాఁడు పాఠశాలకు వచ్చినపుడు విద్యార్థుల నొక్కొక్కరిని పేరుపెట్టి పిలిచి "నాయనా! రాత్రి నీ వెన్నిపొగచుట్టలు తగులఁబెట్టితివి" అని చమత్కారగర్భముగ నడుగుచు, మొగమువాచునట్లు చీవాట్లు పెట్టుచుండువారఁట కూచి నరసింహము పంతులుగారు. ఉపాధ్యాయులలో నింత చండశాసనుఁ డుండఁడని వారి శిష్యులవలన వినికి. ఆయన యనపత్యుఁడు. శిష్యసంతానమే వారి సంతానము. విద్యార్థుల పురోఽభివృద్ధికి, వారి విజ్ఞానాభివృద్ధికిఁ బంటుఁగా

రనేకవిధములఁ బరిశ్రమించెడివారు. నయముననో భయముననో విద్యార్థుల నుద్ధరించుటయే ప్రధానాశయముగఁ బెట్టుకొని నారు. వీరు పెద్ద తరగతివారికంటెఁ జిన్నతరగతివారికే యెక్కువశ్రద్ధ తీసికొని పాఠము చెప్పుచుండువారు. పునాది దిట్టముగ నుండినఁగాని గోడ నిలఁబడ దని వీ రెఱుఁగుదురు. పిఠాపురోన్నత పాఠశాలను ప్రశంసించుచు ౧౯౦౭ లోఁ జెన్నపురపరీక్షా శాఖాధికారులు యోగ్యతాపత్రము నొసఁగిరన్న సంగతి తెలుఁగువా రింకను మఱచియుండరు. మన నరసింహము పంతులుగారి ప్రధానోపాధ్యాయత్వమే యీపాఠశాలకీగౌరవముఁ దెచ్చినది. పంతులుగారు పనిచేయుచున్నపుడు మెట్రిక్యులేషన్‌లో నూటికి నరువదిడెబ్బదిపాళ్లకు నుత్తీర్ణ సంఖ్య పెరిగినది. పంతులుగారు విద్యార్థులను బైతరగతిలోనికిఁ బంపుట కెంతకార్కశ్యము కనఁబఱచెడివారో, దానికిఁ బదిరెట్లుత్తీర్ణులను జేయుటలోఁ గారుణ్యము కానఁబఱచెడివారు. వీరికి శిష్యులయం దెట్టి యాదరమో, వీరిపై వీరి శిష్యుల కట్టి భక్తి గౌరవములు. వీరి శిష్యులు నేఁడు మహాపదవులలో నుండి గౌరవింపఁబడుచున్నారు.

౧౯౩౮ లో నొకమారు పంతులుగారికి గొప్ప జబ్బు చేసినది. అది తెలిసికొని కాకినాడనుండి ముగ్గురు శిష్యులు రాత్రికి రాత్రి బయలుదేఱి వచ్చి వీరి చేతిలో నూఱురూపాయలు పెట్టి 'తమ రివి స్వీకరింపక తప్పదు. మా ప్రార్థనము విని

నిఘంటుకార్యాలయములో నింకఁ బనిచేయవలదు. నిరంతర భాషావ్యాసంగమే మీ యనారోగ్యమునకు హేతువు, అని చెప్పి వెళ్ళిపోయిరఁట. శిష్యప్రేమ యిట్టిదని పంతులుగారు మాటలవరుసలో నీవిషయము చెప్పిరి.

ఎలమంచిలి, నూజవీడు, నరసాపురము పాఠశాలలోఁ బ్రధానోపాధ్యాయులుగా నుండి పిఠాపురాంగ్లపాఠశాలకు వచ్చి యచటఁ బెక్కువత్సరములు పని చేసిరి. ౧౯౨౦ లో శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటుకార్యాలయమునఁ బండితులుగా ప్రవేశించిరి. వార్ధకదశచే నదియు నిర్వహింపలేక ౧౯౩౮ లో మానివైచిరి. నిఘంటుకార్యాలయమున వీరు చేసినకృషి యమూల్యమైనది.

పిఠాపురాధీశ్వరులు గంగాధరరామారావుగారు పంతులుగారికిఁ జదువుచెప్పించి వీరి యభ్యుదయమునకు సర్వథా తోడ్పడిరి. ౧౮౮౮ లో బి. ఏ. ప్రథమశ్రేణిని తీర్ణులైరి. నరసింహముపంతులుగారివంటి శ్రీరామభక్తుని మఱియొకని మనము చూడము. ఆయన గ్రంథములన్నియు రామాంకితములే చేసెను. పంతులుగారి యభిమానవిషయము వేదాంతము. కళాశాలలో వీరి గురువులు కందుకూరి వీరేశలింగముగారు, మెట్‌కాఫ్‌దొర గారు, విలియమ్స్‌పిళ్లె మున్నగువారు. కవితాగురువులు వీరేశలింగకవిగారే యఁట. ఈసంగతి పంతులుగారు తమ 'రామకృష్ణ పరమహంస చరిత్రమున నిటులు చెప్పినారు.

అందఱును నన్ను నరసింహ మంద్రు; కవిత
యందు నాసక్తిఁ బుట్టించునట్టి గురుఁడు
కందుకూరి వీరేశలింగకవిమౌళి
స్థితిగతులు నీకు విన్నవించితిని రామ !

వీరేశలింగము పంతులుగారొక నాఁడు బడిలో "ఆటవెలఁది" లక్షణము విద్యార్థులకు చెప్పి నల్లబల్లమీఁద నీ రెండుచరణము లును వ్రాసి యెవరైన నిది పూరింపఁగలిగినఁ బూరింపుఁ డని రఁట.

ఆటవెలఁది మీర లారసి చేయుఁడి
చేయుకున్న మీకు సిగ్గుపాటు

దీనిని మన పంతులుగా రిటులు పూర్తి చేసిరి.

సిగ్గులెన్ని యున్నఁ జెడిపోవునుగద
ఆటవెలఁది పొందు నార్యులార !

చూచితిరా, పూరణములోని చాతుర్యము! పువ్వుపుట్టఁ తోడనే దాని పరిమళమునుబట్టి యిది యీజాతిపువ్వని కనిపెట్టవచ్చును.

పీఠికాపుర సంస్థానాశ్రయణము పంతులుగారికిఁ గవులలోఁ బెద్దపేరు తెచ్చినది వీరు వ్రాసినగ్రంథములు చాలఁ బాఠ్యములుగా నిర్ణయింపఁబడినవి. ౧౯౦౮ లో శ్రీరామకృష్ణ పరమహంసచరిత్రము పద్యకావ్యముగ నావిష్కరించిరి. ఈక బ్బమునఁ గవిత్వమునుగూర్చి తమయభిప్రాయము నిటుల వెల్ల డించికొనిరి.

మాణిక్యమకుటంబు మౌళిపైఁ దులకింప
రాజ్యంబు నేలెడు రాజుకంటె
లలితలావణ్య విలాసినీ వక్షోజ
కుంభ సౌఖ్యానుభవునికంటె
సతతంబు నానందసారాబ్ధిలోఁ దోఁగు
ధర్మహర్మ్యస్థ సంతన్నుకంటె
ధనవయోరూప సంతానాది భాగ్యాళిఁ
దనరు సంతుష్టుఁడౌ ధన్యుకంటె
మధురమృదువాక్యసంపద మనసుగరఁచు
కవిత నల్లిన కవియె యెక్కువయటంచు
నొంచెదరుగానఁ దత్సుఖ మెంతసుఖమొ
స్వానుభవమునఁ గనుఁగొనఁ బూనవలదె.

శిశిరకుమారఘోషు ఆంగ్లములోరచించిన దానినిబట్టి 'గౌరాంగ చరిత్రము' పద్యకావ్యముగఁ బంతులుగారు సంతరించిరి. పద్య కావ్యములేగాక 'వనవాసి' 'మాపలత' మున్నగునాటకములు వచనకృతులును పెక్కులురచియించిరి. మొత్తము వీరికృతులలో నాంగ్లానుకరణములపాలెక్కువయునవచ్చును. ఈయన గ్రాంథిక భాషాప్రియుఁడు.

ఇన్ని చూచియే కూచి నరసింహమును, పానుగంటి లక్ష్మీనరసింహారావును, చిలకమర్తి లక్ష్మీనరసింహమునుగలిపి 'సింహత్రయ'మని వ్యవహరించిరి. ఈసింహత్రయమును పీఠికాపుర సంస్థానము భరించినది.

---

# చిలకమర్తి లక్ష్మీనరసింహము

## ౧౮౬౭

ఆరామద్రావిడశాఖీయులు. కాశ్యపసగోత్రులు. ఆశ్వలాయనసూత్రులు. తల్లి: రత్నమ్మ. తండ్రి: వెంకయ్య. నివాసము: రాజమహేంద్రవరము. జననము: 26-9-1867 సం. (ప్రభవ సం॥ భాద్రపద బ॥ చతుర్దశిరాత్రి) - నేటికి వీరి వయస్సు 76 సంవత్సరములు. కవికర్తృకగ్రంథములు మొత్తము సంఖ్య 90. రఘుకులచరిత్ర, స్వప్నవాసవదత్తము, సౌందర్యతిలక, హేమలత, భారతకథామంజరి, సర్వశాస్త్రార్థసంగ్రహము, కృష్ణవేణి, సుధాశరచ్చంద్రము, అహల్యాబాయి, ప్రసన్నయాదవనాటకము, పారిజాతాపహరణము, పార్వతీనాటకము, మణిమంజరి, సువర్ణగుప్తుడు, నానకుచరిత్ర, వందనచరిత్ర, కర్పూరమంజరి, వినోదములు, వాల్మీకిరామాయణసంగ్రహము, గయోపాఖ్యానము, గణపతి, ప్రచ్ఛన్నపాండవము, గ్రీసుపురాణకథలు, మహాపురుషుల జీవితములు, మధ్యమవ్యాయోగము, వేమనకవి, రామచంద్రవిజయము, రాజారామమోహనరాయి, రాజారత్నము, రాజస్థానకథావళి, స్వీయచరిత్రము. ఇత్యాదులు.

గయోపాఖ్యానము తెలుఁగులో బహుజనామోదము బడసిన నాటకరాజము. ఆంధ్రులకీనాటకముపై నసాధారణాదరము కల దనుట కది నేఁటికి లక్షపైఁబాతికవేలప్రతు లమ్ముడువడియుండుటయే తార్కాణ. రంగస్థలములపై రక్తికట్టునాటకములలో నిది మొట్టమొదటిది. గయోపాఖ్యానము చిలకమర్తి

లక్ష్మీనరసింహకవిగారు తమ యిరువదిరెండవయేఁట రచించిరి. ఈనాటకమే కవిగారికి మహాకీర్తిసంపత్తులను గావించినది. శ్రీకృష్ణునిసందేశముగొని యక్రూరుఁ డర్జునునితో "నీతో ముఖ్యముగా నీబావ చెప్పు మన్నసందేశము వినుము" అని యిట్లు చెప్పెను.

ప్రాఁతచుట్టాల మని నొక్కి పలుకు మనియె
నొరులకై పగఁబూనుట యొప్ప దనియెఁ
బడుచుఁదనపుబింకమ్ములు విడువు మనియెఁ
దలఁకు మీఱినపని చేయఁదగని దనియె.

దీనికిఁ బ్రత్యుత్తరముగా యుధిష్ఠిరుఁడు 'సీ. నళినగర్భుని గన్న నారాయణుఁడు తాను బాంధవుండగుట మాభాగ్య మగుము... గయుని క్షమియించి పార్థుని గావు మనుము.' అని వచించెను. అనంతరమున నర్జునుఁడుకూడ బావ కిట్లు ప్రత్యుత్తర మంపెను.

"అతిరాగంబు సుభద్రపైఁ బొడమ నన్యస్త్రాన్యకామస్థితిన్
మతి యొక్కింతయుఁ బ్రాజ్యరాజ్యపదవిన్యస్తంబుగాకుండ నే
యతిగానుండినవేళలం బిలిచి నెయ్యంబార నా సోదరీ
పతిఁగాఁ జేసిననాఁటి మేటికృప నాపైఁ జూపవే శ్రీహరీ !

ప్రాణంబులు మాయధీనము చేసినవిపన్నుని బగతున కొప్పగించి శరణాగతత్రాణబిరుదాంకమగు భరతవంశమునకుఁ గళంకము తేఁజాల నని మనవిచేయుదుము." ఈగద్యపద్యముల సొగసు పరికించితిరా ?

సుభద్ర యర్జునని గావు మని శ్రీకృష్ణునితోఁ జెప్పినది. అప్పు డతఁడు రోషావిష్టుఁడై చల్లలితో "ఔను. తప్పు నీమగ నిది కాదు. నాదే-

నీనాథునకు నేను మేనమఱందినై
యాదయంబు నొందుట యొక్కతప్పు
అన్నయానతిఁ ద్రోసి యామహాత్మునకు ని
న్నుద్వాహ మొనరించు టొక్కతప్పు
చిన్ననాఁటనుగోలెఁ జెలిమిమైఁ వారికి
నుపకారములు చేయు టొక్కతప్పు
గర్వితమతి వారు గావించుదౌష్ట్యంబు
నొప్పుకింపుట యొక్కతప్పు
ఒకప్పులే మేము చేయుట యొక్కతప్పు
తప్పు చేయకయుంటయే గొప్పతప్పు
అన్నితప్పులు మాయందె యున్నవబల !
తలఁచి చూడఁ బార్థునియందుఁ దప్పుగలదె ?"

అనెను. ద్రాక్షాపాకముతో, సుప్రసన్నశైలితో, సుమధుర ముగా నాటకపద్యములు నడపించుటలో లక్ష్మీనరసింహము గారిది గొప్పశక్తి. గయోపాఖ్యానమున కృష్ణార్జుల క్రోధసం భాషణము చదువఁదగినది. సీ. నీచ ముచ్చను నాక రాచపాడి దొంగి బిడియ మించుక లేక బిచ్చమెత్త ... మీసహోదరు లకు సాటి మీరె సుమ్మీ అని కృష్ణుఁ డధిక్షేపించెను.

సీ. అల్లుఁడా! రమ్మని యాదరమ్మునఁ బిల్వఁ బంపుమామను బట్టి చంపఁగలమె? ఇత్యాదిగా నర్జునుఁ డాక్షేపించెను. ధీరోదాత్తులగుకృష్ణార్జునులసంభావణము హద్దుమీఱి యున్నను గయోపాఖ్యానము సముచితవర్ణనాకరమై మనోహరముగ నున్నది. కనుకనే తెనుఁగున నీనాటక మింత ప్రశస్తి కెక్కినది.

లక్ష్మీనరసింహకవిగారు నాటకరచనలో నట్టిదిట్లలో నవలారచనలో నంతకంటె నధికులు. వీరు కందుకూరి వీరేశలింగకవివలె నాంగ్లేయగ్రంథానుసారముగఁ గాక చాల భాగము స్వతంత్రముగా నవలలు రచించిరి. వీరి చరిత్రాత్మకకథలలో కర్పూరమంజరి, కల్పితకథలలో గణపతియు నుత్తమస్థానము నలంకరింపఁదగిన రచనలు. కథనచాతుర్యము, కథాసృష్టి, రసపుష్టి గలగద్యరచనమున వీరు సిద్ధహస్తులు. లక్ష్మీనరసింహకవి హాస్యరసాదరము కలవాఁడు. వీరేశలింగముగారి హాస్యరచనయు, పానగంటికవి హాస్యరచనయు కొంచెము మోటుమార్గమున నడచినవి. చిలకమర్తికవి దట్టిదికాదు. మార్దవము తప్పని హాస్యముతో నీలక్ష్మీనరసింహకవి మెచ్చుబడిమూఁడుప్రహసనములు వ్రాసి ప్రకటించెను. జయంతి రామయ్యపంతులుగారు చెప్పినట్లు "వీరేశలింగముగారి హాస్యము చిక్కనిది లక్ష్మీనరసింహముగారి హాస్యము పలుచనిది. లక్ష్మీనరసింహముగారి హాస్యము గిలిగింతలుపెట్టి నవ్వించును. వీరేశలింగముగారి హాస్యము గిల్లి బాధించును."

లక్ష్మీనరసింహముగారి "గ్రంథప్రకటనము" అను ప్రహసనమునుండి వారిహాస్యరచనకుఁ గొన్నిపంక్తు లుదాహరించెద. "పిక్కిలింతల వెంగళప్ప" తాను రచించిన "వైత్రికప్పీయ" మను గ్రంథముయొక్క ఔత్కృష్ట్యము ప్రకటించుచు నాగ్రంథమునఁ గూర్చి యిద్దఱుపండితు లిచ్చినయభిప్రాయములఁ గూడఁ బ్రకటించినారు. వారిలో మహామహోపాధ్యాయ కొంకణక్క గురులింగశాస్త్రిగా రిట్లు వ్రాసినారు.

"ఈ వైత్రికప్పీయమును నేను సమగ్రముగాఁ జూచితిని. కాళిదాస, భవభూతి, మయూర, వ్యాస, వాల్మీకుల కవిత్వములకంటె నిందలికవిత్వము వేయిరెట్లధికముగా నున్నది. ఇందలిపద్యములు గారెముక్కలవలె నెంతో రుచిగా నున్నవి. వీనికి అల్లపుపచ్చడివలె చిన్నవ్యాఖ్యానముకూడ గ్రంథకర్తగారే రచించినందున సర్వజనగ్రాహ్యమై యున్నది. ఇట్టిగ్రంథము జన్మమెత్తి చూచి యెఱుఁగను. ఇఁకముందు చూడఁబోను. ఇంకొకజన్మమునకుఁగూడఁ జూడఁగల నని నమ్మకము లేదు. ఇందలి వీరరసపద్యములు రెండు చదువఁగానే నా కావేశ మెత్తి గొడు గుకామత్తో నాభార్యను మొత్తగా మర్దించితిని. ఈ గ్రంథమందలి పైరెండుపద్యములును నేను చదువుచుండఁగా దగ్గఱనుండి విన్నమానిల్ల బ్రాహ్మణుఁడుకూడ ఆవేశము గ్రహించి కావడిబద్ద తిరగవేసి నన్ను వెన్నుపూస విరుగునట్లు కొట్టెను. కాఁబట్టి యీగ్రంథ మందఱు కొనఁదగినది.

ఈవిధముగా నప్రయత్నప్రవాహసరచనాకౌశలము చిల కమర్తికవి కలవడినది. లక్ష్మీనరసింహముగారు బహుచమత్కార భాషి. మాటమాటకుఁ జమత్కారముచూపి మాటాడుటలో వీరిది మేనమామపోలిక. సుప్రసిద్ధపండితులైన పురాణపండ మల్లయ్యశాస్త్రిలుగారు లక్ష్మీనరసింహకవికి మాతులుఁడు. వారిమాటనేర్పు నాంధ్రమండలిలోఁ జాలమఁది యెఱుఁగుదురు.

లక్ష్మీనరసింహకవిగారి ధారణాబల మసాధారణము. తమ కుటుంబములోఁగాని, తా మెఱిఁగియున్న బంధుమిత్రకవి కుటుంబములలోఁగాని యెవరేనాఁడెన్నిగంటల యెన్నినిమిషము లకు జన్మించినదియు- ఎవ రెప్పు డేమేమి యొనరించినదియు మున్నగువిషయములు చెప్పుచు నత్యాశ్చర్యము గలిగించుచుఁ జక్కని ప్రస్తావనము చేయుచుందురు. వీరి ధారణాశక్తికి 1897 సంవత్సరమునాఁడు జరిగిన చిన్నకథ యిది.

కందుకూరి వీరేశలింగముపంతులుగారు అతిప్రయత్న మునిూఁద తంజావూరునుండి నాచనసోమనాథుని "ఉత్తరహరి వంశము" సంపాదించి తెచ్చి రాజమహేంద్రవరములోఁ బ్రథమ ముద్రణము వేయించుచుండిరి. ఆసందర్భమున మన కవిగారు ఆముద్రాలయమున నున్న "ప్రూఫురీడరు" నొద్దకుఁ బోయి యేనాఁటికానాఁడు మెల్లమెల్లఁగా ప్రూఫుకాగితము లింటికిఁ గొనివచ్చుచుఁ గవితాప్రౌఢత కబ్బురపడుచు హరిశంశమంతయు సంచుమించుగ ధారణపట్టిరి గ్రంథముద్రణము పూర్తికాఁగా

వీరేశలింగము పంతులుగారు లక్ష్మీనరసింహముగారి కొక ప్రతి యీయఁబోయిరఁట. అంతట మనకవివరుఁడు సోమనాథునికవిత్వము సగ్గడించుచు గ్రంథములోని పద్యము లెన్నో గబగబ చదివి యుపన్యాసరీతిగా విశేషములు వెల్లడింప మొదలుపెట్టిరఁట. అది విని వీరేశలింగముగా రాశ్చర్యభరితులై 'ఉత్తరహరివంశము' ప్రాచీనప్రతి మీయొద్ద నేదైనఁగలదా? యని యడుగఁ "దమ రసగ్రహించినదే" యని సమాధానముచెప్పి జరిగినకథ వెల్లడించిరఁట.

ఇంతకును జెప్పఁబోవున దేమన ? ఏనాఁడో యట్లు ధారణపట్టినపద్యములు నేఁటికిని వారు చదువుచుఁ బ్రాచీనకవుల కవిత్వవిశేషములను శ్లాఘించుచుందురు.

పంతులుగారు గొప్పయుపన్యాసకులు. వీరి యుపన్యాసము దూరాన్వయములు లేక మృదువుగానుండి హాస్యరసప్రచురములగు నుదాహరణములతో శ్రోతల కానంద మొనవించును.

వీరు 'మెట్రిక్యులేషన్' పరీక్షలోఁ గృతార్థులై యాంగ్లసారస్వతమును లెస్సగా నెఱిఁగిరి. గురుశుశ్రూష చేసి సంస్కృతభాష నభ్యసింపకపోయినను నేత్రావరోధము వాటిల్లినతరువాతనే భాసకాళిదాసభవభూత్యాదిసంస్కృతకవుల రచనలు చదివించి స్వారస్యములఁ దెలిసికొని భాసనాటకచక్రము (13 నాటకములు) మధురరీతి నాంధ్రీకరించి తమయనల్పప్రతిభ వెల్లడించికొనిరి. కొన్నిచోట్ల వీరి తెలుఁగుసేఁత మూలానుకూలముగ

నుండకున్నను నాటకరచనలో సిద్ధహస్తులగుటచే భావనాట కాంధ్రీకరణము మనోహరముగా నున్నది. సీసపద్యముల దిగువ నెత్తుగీతములు లేకుండ వ్రాసిరి. ఇది క్రొత్తపద్ధతి.

హోమర్ (గ్రీకుజాతీయకవి) మేధావిభట్టు, కుమారదాసుఁడు, మిల్టను మున్నగు మహాకవులవలె లక్ష్మీనరసింహముగా రంధులయ్యును ప్రకృతిరహస్యములు ప్రతిభాబలము చేఁ బ్రత్యక్షీకరించుకొని కవిత్వము చెప్పినమహాకవులు. వీరు కొన్ని పద్యములు మనఃఫలకముమీఁద వ్రాసియుంచుకొని యెవరైన లేఖకు లున్నపుడు వల్లెవేసినపద్యములు చెప్పుచున్నట్లు చెప్పి వ్రాయించుచుందురు. ఇట్లే వీరు లెక్కలేనన్ని గ్రంథములు వ్రాసిరి. లక్ష్మీనరసింహకవి జ్ఞానైకచక్షుష్కుఁడు. వీరికి 40 వత్సరముల యీడువచ్చువఱకు సంపూర్ణనేత్రావరోధము కలుగలేదు. 1909 నుండి మాత్రము. 'కృపాంభోనిధి' నీకని యీవిధముగఁ బ్రార్థించుచున్నాఁడు :

అన్నా ! నీదగుమూర్తి యెట్టిదియొ జాత్యంధుండను కాలాద్యవ
చ్ఛిన్నంబై జగదేకపూర్ణ మగునీచిన్మాత్ర దివ్యాకృతిం
గన్నారం గనఁ బుండరీకదళసంకాశస్ఫురన్నేత్రుఁడన్
నిన్నుం జూడఁగలేను చిత్రమిది తండ్రీ! సత్కృపాంభోనిధీ!

వర్ధమానులగు యువకవుల నాదరించి వారి నేదో విధముగ నభివృద్ధిలోనికిఁ దీసికొనిరాఁగోరు దయాహృదయము వీరిది. వీరిమనసు కుసుమమెత్తన. సజ్జనశబ్దమునకు లక్ష్మీనరసింహము గారు

సరిపడినయుదాహరణము. "మృణాళం నవనీతమిాలితం నవనీతా దపి సజ్జనస్య హృత్."

పేదవారల కొఱకై వీరు చదువులు చెప్పించిరి. నిరుద్యోగుల నెందఱనో వాక్సాహాయ్యముచే నుద్యోగుల నొనరించిరి. వీరు కేవలకవులే కాక వీరేశలింగముగారివలె సంస్కరణాభిలాషులు. దేశసేవకులు. దేశమాత, మనోరమ మొదలగు పత్రికలు ప్రచురించి దేశభాషాసేవ గావించిరి. వీరేశలింగము పంతులుగారి సంస్కరణోద్యమ మందును వారి భాషా సేవ యందును వీరి కనుపమానమగుభక్తి. సర్వవిధ ముల వారి యుద్యమములను క్షుణ్ణముగ చేసినవారు వీరే. కందు కూరివారు ఖడ్గవాదులు. చిలకమర్తివారు కార్యవాదులు. ఇది యీయిర్వురకును గల తారతమ్యము. 'లక్ష్మీనరసింహముగా రిదియీమతము' అని చెప్పుట కష్టము. ఆయన సంస్కారవా దులగు వీరేశలింగకవిగారికిఁ గుడిభుజముగఁ బని చేసిరి. పీఠికాపుర ప్రభువులతోఁ జెలిమి వాటించిరి. దేశనాయకుఁడు టంగుటూరి ప్రకాశముపంతులుగారిని గౌరవించిరి. 'అన్యులమనమున్ నొ ప్పింపక తా నొవ్వక తప్పించుక తిరుగువాఁడు' కాన లక్ష్మీ నరసింహకవిగారి నేవిషయమునను నాక్షేపించువారు లేరు.

చిలకమర్తికవి యార్జనము లక్షకు దాఁటినది. గ్రంథముల వలన నింతసంపాదనము చేసినవారు తెలుఁగువారిలోఁ దక్కువ.

మఱియొకవిషయము. 1907 లో వంగదేశమునుండి 'విపినచంద్రపాలు' అనునాతఁడు వచ్చి 'గోదావరీమండలమహా

సభలో నుపన్యసించుచుండెను. ఉపన్యాససందర్భమున ఆసు వుగ లక్ష్మీనరసింహముగా రీపద్యము చదివిరి.

భరతఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేఁగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరిగొల్లవారు
పిదుకుచున్నారు మూతులు బిగియఁగట్టి.

నాఁడు కొన్నినాళ్లీగీతము చదువనివారు లేరు. భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు తెల్లవారను=తెల్లవారఁగా అను నర్థము చెప్పి ప్రభుత్వము నోదార్చిరి. అప్పుడే వీరిపేరు మాఱు మ్రోగినది. బహుజనముచే నాదరింపఁబడు కవితయే కవిత. అదియే శాశ్వతముగా నిలుచును. మన చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి పద్య మొక్కటైన కంఠపాఠము చేసికొనని వారు తెలుఁగువారిలో నుండరు.

నవలారచనమునను, నాటకకర్తృత్వమునను, ప్రహసనపుఁగూర్పునను సిద్ధహస్తుఁడై, దీనావనదీక్షితుఁడై దీర్ఘాయుష్కుఁడైన లక్ష్మీనరసింహకవి కాంధ్రవిశ్వవిద్యాలయమువారు మొన్న 1943 లో కళాప్రపూర్ణ బిరుదము నొసఁగి సముచితముగ సత్కరించిరి. ఇట్టి యీమహాకవి వీరేశలింగకవి తరువాత 'స్వీయచరిత్ర' వ్రాసికొనెను. వీరి స్వీయచరిత్ర ఆంధ్రకవులచరిత్రయు- ఆంధ్రదేశచరిత్రయు ననఁ గలిగి మహోపకారకమైయున గ్రంథము. అది యచ్చుపడవలయును.

---

# తిరుపతి వేంకటేశ్వర కవులు

## ౧౮౭౧—౧౯౧౯

ఈజంటకవులలో మొదటివారు దివాకర్ల తిరుపతిశాస్త్రి గారు. రెండవవారు చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు. తిరుపతి శాస్త్రిగారు వెలనాటిశాఖీయులు. అభిజనము: ఎండగండి. (కృష్ణామండలము) తల్లి: శేషమ్మ. తండ్రి: వేంకటావధాని. జననము:1871. నిర్యా: 1919. వేంకటశాస్త్రిగారు ఆరామ ద్రావిడశాఖీయులు. జన్మస్థానము: ఏనాము (ఫ్రెంచివారిది) నివాసము: కడియము. తల్లి: చంద్రమ్మ. తండ్రి: కామయ్య. జననము: 1870 ప్రమోదూతనామసం॥ శ్రావణ శుద్ధద్వాదశి సోమవారము. విరచితగ్రంథములు: పాండవజననము, పాండవోద్యోగము, పాండవాశ్వమేధము, పాండవరాజసూయము, పాండవవిజయము, పాండవప్రవాసము, ముద్రారాక్షసము, మృచ్ఛకటికము, బాలరామాయణము, ప్రభావతీప్రద్యుమ్నము, బుద్ధచరిత్రము, ఏలామాహాత్మ్యము, లక్షణాపరిణయము, శ్రీనివాసవిలాసము, దేవీభాగవతము, విక్రమాంకదేవచరిత్రము, చంద్రప్రభా చరిత్రము, హర్ష చరిత్రము, శనిగ్రహము, గీరతము, గుంటూరుసీమ, నానారాజసందర్శనము. ఇత్యాదు లనేకములు.

'రెండుబాసలకు మేమె కవీంద్రుల' మని కొన్నినాళ్లాంధ్రకవితాసామ్రాజ్యము నేకచ్ఛత్రముగఁ బరిపాలించిన తిరుపతివేంకటకవులు జగమెఱిఁగిన బ్రాహ్మణులు. ఆంధ్రదేశమున వీరిపేరు నెఱుఁగని యభిజ్ఞుఁ డుండఁడు. ఆధునికాంధ్రకవు

ంలో వీరిని గురుసములుగా భావించువారనేకులు. తిరుపతివేం కటకవుల నేకలవ్యశిష్యుల మని చెప్పుకొని గౌరవింపఁబడువా రెందఱో కలరు. ఆంధ్రములో వీరు సందర్శింపని రాజాస్థానము లేదు. ఆరంభదశలోఁ దిరుపతి వేంకటకవులు 'తిరుపతి వేంకటే శ్వరు' లనియే కొంతవాడుక. ఈజంటకవు లేమహారాజును లెక్కసేయలేదు. 'అనుభవించితిమి దివ్యభోగములను రాజాధి రాజులకన్న నధికముగను' - 'ఏనుఁగు నెక్కినాము ధరణీంద్రులు మ్రొక్కఁగ నెక్కినాము' అని చెప్పుకొనుచుఁ బ్రతిపట్టనము, బ్రతిజనపదముఁ దిరిగినారు. ప్రతిదాతను దర్శించినారు. వారిచేఁ దగినట్లు సన్మానింపఁబడిన సరియే. లేనిచో సహజకవితాధోర ణితో మొగమువాచునట్లు తిట్టుఁబద్యములు చెప్పుట- ఈకవులు సిద్ధవాక్కులని వారు పాదాక్రాంతులగుచుండుటఁ బెక్కుచోట్ల జరిగినది. అనిదంపూర్వమైనవీరి యద్భుతశక్తి కాశ్చర్యపడి యనేక కవులు 'శిష్యోహ'మ్మని చరణములఁ బడఁజొచ్చిరి. వీరియవధాన ప్రతిభ సరసి తెనుఁగుమన్నీ లెందఱో బిరుదముల నొసఁగిరి. సాలువలఁ గప్పిరి. సన్మానములఁ జేసిరి. ఏనుఁగులపై నూరేఁ గించిరి.

తిరుపతికవులజీవిత మొకమహాభారతము. ఇం దేపర్వ మును బరిశీలించినను బ్రతిజ్ఞలు సేయుట, మీసములు దువ్వుట. ప్రతిపక్షులను బరిహసించుట, పద్మవ్యూహములఁ బన్నుట, వానిని భేదించుట, యెదిరి యెట్టివాఁడైన సాహసించి మీఁది

క్షరకట యివి చూతుము. ఈభారతమునఁగూడ రాయబారముల రభసలు, శతఘ్నుల చప్పుళ్లు, పాశుపతప్రయోగములు, అట్టహాసములు, తాలుకుట్టనములు కలవు. పాండవోద్యోగవిజయములు, పాండవాశ్వమేధము మున్నగునవి దీనిలోనివే. గీరతముకూడ నీభారతములోనిదే. ఈ భారతసంగరమునకు 'గుంటూరుసీమ' కురుక్షేత్రము.

వాగ్యుద్ధములవలనఁ దిరుపతికవులకీర్తిచంద్రిక నలుమూలల వీసి తెలుఁగులకల లూఁపించినది. తిరుపతిశాస్త్రిగారు వెలనాఁటివారు, వేంకటశాస్త్రిగారు రామచంద్రాపురమువా రైనను సోదరులవలె మెలంగుచుఁ బరస్పరసహకారముతో నవధానములు, ఆశుకవితలు, ఆకాశపురాణములు ప్రదర్శించుటచే వీరి పేరు త్వరలోఁ బ్రశస్తి కెక్కినది. అవధానకళకు గౌరవము దెచ్చినవారు తిరుపతికవులే. చులుకఁదనము కల్పించినవారును దిరుపతికవులే. వీరికి ముందు శ్రీమాన్ మాడభూషి వేంకటాచార్యులుగారును, సంతకు మిక్కిలి ముందు రామరాజభూషణుఁడు (భట్టుమూర్తి) మున్నగువారు శతలేఖినీగ్రంథసంధానచాతురి గలవారున్నను వారెవ్వరును దిరుపతివేంకటకవులవలె జంటకవులుగానుండి యవధానములు చేసినవారు కారు. పిఠాపుర సంస్థానకవులైన దేవులపల్లిసోదరులును, వేంకటరామకృష్ణులు నష్టావధానాశుకవితాప్రదర్శనము లొనరించి యున్నను దిరుపతివేంకటకవులవలె నవధానవిద్యచే జగద్విఖ్యాతి నొంద

రించినవారు కారు. రామరాజులవారికాలమున నంది మల్లయ్య ఘంట సింగయ్య యనుజంటకవులు ప్రబంధరచనము గావించిరి. కానివా రవధానముల నొనర్చియుండిరో లేదో చెప్పుటకుఁ జరిత్రాధారములు లేవు 'జగదాశ్చర్యకరావధానకవితా సంపత్తి' తిరుపతివేంకటకవియుగళమునకే తక్కినది.

'గోణముకట్టుటాది' వేంకటశాస్త్రిగారికిఁ గవితాభిలాష యుండెడిది. ప్రఖ్యాతశాస్త్రపండితులు చర్ల బ్రహ్మయ్యశాస్త్రిలవారియొద్ద నీజంటకవుల వ్యాకరణాధ్యయనము. ఇరువురును మహామేధావులు గాన నచిరకాలములో వాఙ్మయ మధికరించిరి. తిరుపతి శాస్త్రిగారికిఁ దొలుతఁ బద్యలక్షణములు వేంకటశాస్త్రిగారే చెప్పినట్లు వినుదుము. శిష్యస్వరూపమున నొకపద్యము తిరుపతికవి వేంకటకవిపైఁ జెప్పిన యీపద్య మెంతరసభావభరితము!

పతతాత్మీయశతావధానకవితావిద్యాపయోరాశి, సం
భృతశిష్యాంబుదవాఙ్మయామృతరసప్రీతాఖిలాంధ్రక్ష మా
ధృతరజ్యద్రసికావతంసకృతపండిస్తోత్రమాలా విభూ
షితుమా వేంకటశాస్త్రినేఁ బొగడెదన్ శిష్యస్వరూపంబునన్.

తిరుపతికవి యప్రతిమానమైనపాండితీప్రతిభయుఁ జెళ్లపిళ్లకవి యసాధారణమైనమేధాబలమును గలసి 'తిరుపతివేంకటేశ్వరులను' దెలుఁగుకవులలో నగ్రేసరుల నొనరించినది. తిరుపతి లేనిదే వేంకటేశ్వరుఁడు లేఁడు. వేంకటేశ్వరుఁడు లేనిదే తిరుపతి లేదు. ఈజంటపేరు చిల్లర పదములయే ఘనతకుఁ గారణ మ

చెప్పినారు. ఎక్కడ విన్నను వారిపద్యములే. ఎక్కడఁజూచినను వారిశిష్యులే. ఏప్రాంతముసఁ దిరిగిన వారియవధాన ప్రశంసలే. 'తిట్టుల్ దిట్టితిఁ దిట్టులంబడితి'నని యనేకులను హుంకరించినారు. అనేకపండితుల గద్దించినారు. "అటు గద్వా లిటు చెన్నపట్టనము మధ్యం గల్గుదేశమ్ము" నొకయూఁ పూఁపినారు. కాశీనాథశాస్త్రివంటి యుద్దండపండితుల 'నబ్బ' యనిపించినారు. మహా మహోపాధ్యాయులు సైతము మర్యాదగాఁ దప్పించుకొని తిరుగుచుండెడివారు. అది వారిశాస్త్రపాండిత్యమునకు జంకి యనుటకు వీలుకాదు. తిరుపతికవులు సంస్కృతాంధ్రములలోఁ బెద్దపాండిత్యము కలవారేయైనను శాస్త్రేతరములందుఁ బ్రత్యేక పండితులైన మహామహులనుగూడ మాటాడనీయక పోవుట మాత్ర మాంధ్రలోకమున కాశ్చర్యావహమైనది.

తిరుపతిశాస్త్రిగారు ప్రాచ్యపాశ్చాత్య భాషలయందు విద్వాంసులైన పోలవరముజమీందారువారిదృష్టి నాకర్షించిరి. కొన్ని వత్సరములు వారియొద్ద గౌరవవేతనముఁ బడయుచు, వారిచే ననేకరీతుల సన్మానింపఁబడుచుండిరి. ఇంతలోఁగాల మీ మహాకవిని పొట్టఁ బెట్టికొనినది.

చెళ్లపిళ్లశాస్త్రిగారి యుపన్యాసవాణి మేజువాణి. వీరుసభలలో నుపన్యసించుచుండునపుడు వేనవేలు విఱుఁగఁబడి వినుచుందురు ఎంతవానినైన నప్పటికప్పుడు ముఖపిధానము సేయుశక్తి వీరిది. వీరిప్రతిపదము ధ్వనిపూరితము. వీరి పేరు విని

బందరునందలి యున్నతపాఠశాల వేంకటశాస్త్రిగారి నాహ్వా నించినది. ఆసందర్భమున ననేకులు వీరిచేతిలోఁ గవులైరి. వారే నేఁడు మహాకవులై నవ్యసాహితీలోకమున నఖండప్రశంసల నందుచున్నారు. తిరుపతికవులశిష్యులము - విశేషించి వేంకట శాస్త్రిగారిశిష్యుల మనువారిలో అబ్బూరి, వేటూరి, వేలూరి, కాటూరి, పింగళి కవులు ముఖ్యులు. బందరుపురము వేంకట శాస్త్రిగారికి బ్రహ్మరథము పట్టుచు. 'కృష్ణ' వీరి పలు కులు విని పొంగిపోవును. 1933 సం॥న బందరుపౌరులప్రోత్సా హమునను, కవిశిష్యులయభినివేశమునను వేంకటశాస్త్రిగారికి షష్టిపూర్తిసన్మానమహోత్సవము వైభవోపేతముగ జరిగినది. ఆసందర్భమున వీరిశిష్యప్రశిష్యులు కవికుమారులు వందలకొలఁది వచ్చి కావ్యోపహారము లర్పించిరి. ఆదివ్యమహమున

పుడమిఱేఁడులు తల లడుగులు మోవంగ
నర్పించుకాన్కల నందువాఁడు
అత్యద్భుతం బైనయవధానవిద్యకుఁ
బ్రభవకారణ మైనప్రతిభవాఁడు
వీనుదోయికిఁ దేనెసోనలు వర్షించు
వాఙ్మాధురికిఁ బేరువడినవాఁడు
చిననాఁడె వలచి వచ్చిన కవితాకన్య
నేకపత్నిగఁ జేసి యేలువాఁడు

పూర్ణకాముండు త్యాగియు భోగయైన
గురుని ఋణ మీఁగువొంటె నీచిఱుతకబ్బ
మర్పిత గడించుకొనుఁగాక యాంధ్రవాణి
కడకనుల జాల్కొనుప్రసాదకణలవాప్తి.

అని గురుదక్షిణగా 'సౌందరనంద' కావ్యము పింగళి కాటూరి కవియుగళముచే వేంకటశాస్త్రిగారి కర్పింపఁబడినది. ఆషష్టిపూర్తి మహోత్సవము తెలుఁగువాణి కొకయుజ్జ్వలాలంకారము. ఇది యననేల? తిరుపతివేంకటకవులు తెలుఁగునాఁట నొందనిగౌరవమే లేదు. క్రొత్తగా నొందఁదగినదే లేదు. కృష్ణాపత్రికాధిపతు లనినట్లు 'వీరికవిత్వము ప్రాచీనవిధికి భరతవాక్యము. నవీనకవిత్వమునకు నాంది. వీరికవిత్వమున దెప్పుడుఁ జూచినను సౌకుమార్యము పౌరుషము జీవము గోచరించుచుండును. ఈ విలక్షణములే యాంధ్రదేశమున శిష్యసహస్రముల వెదచల్లినవి. వీరిరచన లెక్కువగ వీరిజీవితమునకు సంబంధించిన వగుటచే నాకవిత్వ మాత్మగౌరవమును బ్రతిష్ఠించికొనినది.'

ఈజంటకవులు వ్రాసినకావ్యములలో "బుద్ధచరిత్రము" చక్కని పాకమునఁ బడినది. వీరి దేవీభాగవతముతోఁ బాటు బుద్ధచరిత్రయు సారస్వతలోకమున స్థిరముగా నుండు నని చెప్పవలయును. బుద్ధచరిత్రము భావరసములకు నిదానమైన మధుర కావ్యము. ఇది ప్రాచీనమార్గముల నతిక్రమించని ప్రబంధమైనను బూర్వవర్ణనములగడబిడ యెచ్చటను లేదు. కొంచెము లింపా

యిగాఁ దిరుపతికవులు ప్రాచీనప్రబంధధోరణి వీడి నవ్యమార్గములతో వర్ణనాదులు గావించిరి. శ్రవణానందాదులలో శృంగారఘట్టములు మితిమీఱి వర్ణింపఁబడినవి. కాని యవి నాఁడు రసపోషకములుగానే యగపట్టినవి. శ్రవణానందములోఁ బూర్వపువాసనను బూర్తిగాఁ దొలఁగింపలేక సీ. రాజులెల్లరును భార్గవరాముతే యనఁ దేజంపుపెంపు నుతింపవలెన, కోమటులెల్ల జక్కులరాజులే యన్న నైశ్వర్యములపెంపు లనుగవలెన. ఈ మొదలగువర్ణనములు గావించిరి. మ. మనమూ! వద్దిక నాఁడు మాట వినుమా మర్యాద కాపాడుమా! మొదలగుపద్యము లకుఁ దెలుఁగుదేశమున నాశనము లేదు.

'వ్యాకరణ మొక్కత్రోవ మహాకవు లొకత్రోవ' యని చెప్పి తిరుపతికవులు వ్యాకరణబంధములు నిరంకుశులై సడలించి గిడుగు రామమూర్తిపంతులుగారి మెచ్చులు గొనిరి.

తిరుపతివేంకటకవుల జీవనజ్యోతి సర్వాభిషేకపరక్ష. వీ రాంధ్రమున 'నానారాజసందర్శనము' గావించిరి. ఆయాసందర్భములఁ జెప్పినపద్యములు వారిశిష్యప్రశిష్యద్వారమున లోకమెల్లెడ వ్యాప్తములై యచ్చులో లేకున్నను అయిదాఱుశతాబ్దుల వఱకు నశింపనిస్థితిలో నున్నవి. పాండవనాటకములు, శ్రవణానందము, మఱికొన్నిచాటుపద్యములు, ఇవి పారాయణము చేసికొనుకవులు చాలమంది కలరు.

శతఘంటకవనమ్ము నల్పసంగతి యన్నఁ
'కరతలామలకమ్ము'గాదె మాకు
అష్టావధానకష్టావలంబన మన్న
'నంబికొండయుదండనంబు' మాకు
ఆశుధారాకవిత్వాడంబరం బన్న
'నల్లేరుపై బండినడక' మాకు
సత్కావ్యనిర్మాణచాకచక్యం బన్న
'షడ్రసోపేతభోజనము' మాకు
వ్యర్థమగువాదము లొనర్చునట్టివారి
డంబ మణఁగించు టూపోశనంబు మాకు
దానరాధేయ! కవిసముదాయగేయ!
పండితవిధేయ! రామభూపాలరాయ!

ఏనుఁగు నెక్కినాము ధరణీంద్రులు మ్రొక్కఁగ నెక్కినాము స
న్మానములందినాము బహుమానముల గ్రహియించినార మె
వ్వానిని లెక్కపెట్ట కనివారణ దిగ్విజయం బొనర్చి ప్ర
జ్ఞానిధులంచుఁ బేరు గొనినారము నీవలనన్ సరస్వతీ!

తిరుపతికవుల గ్రంథములు భారతీభాండారమున నుచ్చస్థానమున నుండఁగలవి. నవ్యకవితాగంగావతరణమునకు భగీరథులై, యాంధ్రసారస్వతమున కొక యపూర్వవికాసము కలిగించిన తిరుపతి వేంకటకవులు బాలకలానిధులు- బాలసరస్వతులు- కింకవీంద్ర ఘటాపంచాననులు- కళాప్రపూర్ణులు.

---

# చిలుకూరి వీరభద్రరావు

## ౧౮౭౨–౧౯౩౯

ఆఱువేల నియోగిబ్రాహ్మణులు. అభిజనము: తణుకు తాలూకాలోని 'రేలంగి'. నివాసము రాజమహేంద్రవరము, కొవ్వూరు. జననము 17-10-1872. నిర్యాణము 1939 సం. రచిత కృతులు: రాజమహేంద్రపుర చరిత్రము. ఆంధ్రుల చరిత్రము-జీర్ణకర్ణాట రాజ్యచరిత్రము.| తిక్కన సోమయాజి, తిమ్మరుసు మంత్రి- శ్రీనాథకవి- శివాజీచరిత్ర, కర్ణసామ్రాజ్యము, నవరసిక మనోల్లాసిని, స్వయంసహాయము, వరలక్ష్మి విలాసము, హిందూసంసారము, హిందూగృహము, హాస్య తరంగణి, సుమిత్ర, అళియ రామరాజులు, నాయకురాలి దర్పణము.

వీరభద్రరావుగారు చరిత్రచతురాననులు. 'ఆంధ్రుల చరిత్ర'తో వీరి కఖండకీర్తి వచ్చినది. ఆంధ్రులప్రాచీనచరిత్రమును బరిశోధించి వెలువరించినవారిలో నీయనయే కనిష్ఠికాధిష్ఠితులు. వీరి యనంతపరిశోధనములనుండియే నేఁటి పలువురు రచయితలు చక్కనివిషయములు సంగ్రహించి పత్త్రికాపాఠకుల కిచ్చుచున్నారు.

వీరభద్రరావుగా రాంధ్రభాషకుఁ బ్రాణములు దార వోసిరి. ఆంధ్రజాతిపై వీరి కవ్యాజమైన యాదరము. వీరు సంఘసంస్కృతి నభిలషించిన సదాశయులు. జాతివికాసము కలిగింప

నుంచి దేశోపకారి, విబుధరంజని, ఆంధ్రకేసరి పత్రికలు ప్రకటించిరి.

పంతులుగారికలము జంకుగొంకులు లేనిది వాదోపవాదములలో విలయనాట్యము సలిపినది. కలములో నున్నంత నిరంకుశత నోటిలో లేదందురు. ఎంతయావేగముగా వాదించినను జివరకు నవ్వుకొనుచు మఱియొక సంభాషణములోనికి మార్చివైచుటమాత్రము వారియందు గల మంచిగుణము. ఆత్మగౌరవము ఆత్మవిశ్వాసము వీరి చేతలలో స్వాతంత్ర్యము చూపిననిరంకుశుఁ డీయన. తెలుఁగువారిలోని కొన్నిజాతులను గుఱించియుఁ గొన్నివర్ణములనుగుఱించియు పునరావుగారు వెలువరించిననిర్ణయములు కొన్నిసంస్థానములకుఁ గోపకారణము లైనవి. సంస్థానప్రభువులు కొందఱు వీరభద్రరావుగారిపై నాగ్రహము చూపుచుండిరి. వారు తలఁచినచో నేమి చేయలేరు? వేదము వేంకటరాయశాస్త్రిగారిది గుర్తించి 'వీరభద్రరావుగారు! ప్రమాదము సుమండీ' యని మందలించిరఁట. వీరది లెక్కసేయుదురా? సత్యప్రకటనమే సత్యశోధకలక్షణమని నమ్మిననిర్భీకుఁ డాయన. పంతులుగారు 'వళియరామగాయకులు' అను గ్రంథములో 'రివరెండు-హీరాసు'గారి వ్రాఁతలను సయుక్తికముగ ఖండించిరి. ఆంధ్రేతిహాసపరిశోధకమండలి వెలువఱిచిన కాకతీయసంచికపై వీరి ఖండనము సప్రమాణమై మెచ్చు

నందినది. వీరి 'జీర్ణకర్ణాటసామ్రాజ్యము' యాంధ్రాభిజ్ఞుల్లు పెక్కు 'కా'ననిరి. ఇదియే వీరితొలిరచనము.

పంతులుగారివిమర్శనశక్తి చవిచూడనివా రుండరు. వీరి యాంధ్రులచరిత్రలోని కొన్నికొన్నిసిద్ధాంతములు నూతనపరిశోధనములవలన నిలుచునవిగావు. ప్రథమప్రయత్నము లన్నిటిలోను గొన్నిదోషము లుండుట క్రొత్తగాదు. అది యాక్షేపణీయమును గాదు. వీరివిమర్శలో మొగమోట మనునది పూజ్యము. సత్యపరిశోధనమునకుఁ దమయాస్తిని దమయారోగ్యమును దుదకుఁ దమప్రాణములను గోల్పోయిన వ్యాసజీవులు. జననము మొదలు మరణమువఱకుఁ గష్టపరంపరలతో నిండిన జీవితము వీరిది. దానికి హేతువు నిరంతరపరిశోధనపరత్వమే. ఒకసభలో రామలింగారెడ్డిగారు 'వీరభద్రరావుగారి విమర్శనశక్తి చాల గొప్పది. దానిని వర్ణింప నా కర్హత లే' దని చెప్పినారు. ఆంధ్రచరిత్రకారులలో వీరభద్రరావుగారు, లక్ష్మణరావుగారు, రామయ్యపంతులుగారు, వీరేశలింగము పంతులుగారు నొక్క శ్రేణికిఁ జెందినవారు.

వీరభద్రరావుగారు చదివినది 'స్కూలుఫైనలు'వఱకే యనుకొందుము. అయిననేమి? వారు చరిత్రచతురాననులు. పదవులకొఱకుఁ బ్రాకులాడక యాంధ్రచరిత్రపరిశోధనమునకుఁ దమయావజ్జీవనము ధారవోసి తరించిన యిట్టిమహాపురుషుఁడు చిరస్మరణీయుఁడు.

వీరభద్రరావు పంతులుగారి 'ఆంధ్రుల చరిత్ర'యే తెలుఁగు వారిలో జాతీయాభిమానము రగుల్కొల్పినది. భావిచరిత్రనిర్మాతల కాంధ్రులచరిత్ర యొకపెన్నిధి. చిలుకూరివారిచరిత్రపరిశోధనరంగములోఁ బ్రాచీనాంధ్రసౌభాగ్యము ప్రాచీనసామ్రాజ్యవిభవము తెరదొలఁచుకొని వచ్చి మధురనాట్యము చేసినది.

ఆ సుప్రభాతికదేవా యింక మనకుఁ గానరాదు. ఆంధ్రుల చరిత్రముమాత్రమే యాంధ్రదేశమం దెచ్చటఁ జూచినను గన వచ్చును. నేఁడు పరిశోధకులలోఁ బేరందుచున్న శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు వీరభద్రరావుగారి ప్రతిభ నభినందింతురు. శ్రీ కందూరి ఈశ్వరదత్తు బి. ఏ గారు వీరిపేసల్లూరు వీరేశలింగము పంతులుగారి తరువాత నాంధ్రచరిత్రకారులకు వీరభద్రరావుగా రాదర్శపు లని యాంధ్రు లైకకంఠ్యముగా నంగీకరింప వలసినదే.

రాజమహేంద్రవరమునఁగల ఆంధ్రచరిత్రపరిశోధకసభా ప్రతిష్ఠాపకులలో శ్రీ వీరభద్రరావుగా రొకరు. ఇట్టిపంతులుగారికి ౧౯౩౮ లో నందాల్యలయందు సర్వేపల్లి రాధాకృష్ణుని యాజమాన్యమున జరిగిన 'ఆంధ్రమహాసభ'లో 'ఆంధ్రచరిత్ర చతురానన' యను బిరుద మిచ్చి సత్కరించిరి.

—

# కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు

## ౧౮౭౭—౧౯౨౩

లింగధారినియోగి. తండ్రి: వెంకటప్పయ్య. జననస్థానము: పెనుగంచిప్రోలు(కృష్ణా మండలము) జననము 1877 సం. నిర్యాణము 12-7-1923 సం. విరచితకృతులు: ఆంధ్రవిజ్ఞానసర్వస్వము (2 సంపుటలు వీరి సంపాదకత్వమున వెలువడినవి) శివాజీ చరిత్ర, హిందూదేశకథాసంగ్రహము, మహారాష్ట్ర విజృంభణము, లక్ష్మణరాయవ్యాసావళి, హిందూ మహమ్మదీయ యుగములు.

లక్ష్మణరావుగారు సిద్ధహస్తులైన యాంధ్రరచయితలు. వీరు భాషాసేవకులలోఁ బ్రథమశ్రేణిని లెక్కింపఁదగినవారు. 'విజ్ఞానచంద్రిక' యాంధ్రగ్రంథమాలలలో నెంతప్రతిష్ఠ గడించినదో లక్ష్మణరావుగా రాంధ్రచరిత్రోద్ధారకులలో నంతకీర్తి సంపాదించిరి. విజ్ఞానచంద్రికకు లక్ష్మణరావుగారు జీవగఱ్ఱ. ఈ గ్రంథమాలలో నీపరిశోధకునిచేయి సోఁకనిగ్రంథము లేదు. కలకత్తా యమ్. ఏ. పరీక్షలో నుత్తీర్ణులైననాఁటినుండియు వీరి హృదయక్షేత్రమున వాఙ్మయసేవాంకురములు రేకెత్తుచువచ్చినవి. అవియే 'విజ్ఞానచంద్రిక'కు శుక్లపక్షములైనవి. ఈగ్రంథమాలలో పదార్థవిజ్ఞాన- పారిశ్రామిక- ప్రకృతి- భౌతిక- రసాయన- వృక్ష- జీవ- వైద్యశాస్త్రములకుసంబంధించినగ్రంథము లెన్నియో వెలువడినవి. ఈగ్రంథమాలలోఁ గావ్యనాటకములకుఁ జోటులేదు. దేశోద్ధారకులగుమహాపురుషులజీవితచరిత్ర

ము లిందుఁ బెక్కు ప్రకటితములు. ఆయావిషయములలోఁ ప్రత్యేకప్రవీణులైన చిలుకూరి వీరభద్రరావు- కట్టమంచి రామలింగారెడ్డి- గురజాడ అప్పారావు- ఆచంట లక్ష్మీపతి- అయ్యదేవర కాళేశ్వరరావు- గోటేటి జోగిరాజుపంతులు మున్నగువారెందఱో దీనికి గ్రంథములు వ్రాసి యొసఁగిరి. 'విజ్ఞానచంద్రిక' యాంధ్రి కఖండసేవఁజేసి యవ్యర్థమైన స్మరణీయమహాసంస్థ. అప్రస్తుతమైనను లక్ష్మణరావుగారితోపాటు దీనిని సంస్తుతింపక తప్పను.

లక్ష్మణరావుపంతులుగారికి వీరేశలింగముగారే లక్ష్యస్వరూపులు. వీరు తమరచనము సామాన్యగ్రాంథికముగ నడపించి జనబాహుళ్యము నాకర్షించిరి. కాని నాఁటికిఁ బెచ్చుపెరిగియున్న గ్రాంథికవ్యావహారిక వాదప్రతివాదసమరములోఁ జేయిచేసికొనలేదు. ఆ తాటస్థ్యమే వీరిచే నమూల్యమగు విజ్ఞానసేవ చేయించినది. దేశభాషయొక్క సర్వతోముఖాభ్యుదయము, దేశభాషయందు సర్వశాస్త్రములు వెలువరింపవలయునన్న యభినివేశము కలిగి కొంతవఱకుఁ గృతకృత్యులైనసుకృతి యితఁడు. ఆయన యభిలషించినది భాషాజీవము, భాషాస్థిరత్వము. లక్ష్మణరావుగారుకూడఁ గొందఱివలెఁ దెగుడెంపులేని భాషావివాద వాగురలోఁ దగుల్కొనినచో 'విజ్ఞానచంద్రిక' యేతరగతి గ్రంథమాలలలో లెక్కింపఁబడవలసియుండెడిదో!

మనభాషలో లేనిశాస్త్రగ్రంథము లుండరాదనియు, నప్పుడే వాఙ్మయమునకు సుస్థిరత్వము చేకూరుట కవకాశ

ముందు ననియు వీరి ప్రధానాశయము. ఈ యాశయమే వంతులు గారికి ప్రబంధములమీఁదను, ఖండకావ్యములమీఁదనుమక్కువ తక్కువచేసినది. ఇంతమాత్రమున నీయనకుఁ గావ్యకళాదృష్టి గాని, కావ్యరసాస్వాదశక్తిగాని లే దనుటకు వీలుపడదు. లలిత కళలనుగూర్చి వెలువరించిన ప్రత్యేక గ్రంథము, కావ్యకళనుగూర్చిన వీరి ప్రత్యేకవ్యాసములు వీరికిఁ గళాపరిశీలకులలో గౌరవ స్థానము నీయకపోవు. కేవల కావ్యములవలన వాఙ్మయమునకు శాశ్వతత్వముకలుఁగ దని యొకయభిప్రాయముపెట్టుకొని శాస్త్ర గ్రంథరచన ప్రకటనములకు జీవిత మర్పించిరి.

ఆంధ్రదేశచరిత్రరచనకు శ్రీకారముచుట్టినమహాశయుఁ డీతఁడే. వీరు నాటినవిత్తు నేఁటికి మహావృక్షమైనది. ఈయన యేవిషయమునను బొరపడియుండలేదు. పలుసారులు పరిశీలించికాని యేరచనము బ్రచురింపలేదు. కావున నీయనయక్షరములు శిలాక్షరములైనవి. పరిశోధకలక్షణములు వీరికిఁ బ్రాతిగఁ బట్టినవి. పత్రికల కెక్కుట, ఉపన్యాసపీఠములపై గర్జించుట వారికి లజ్జాకరము. ఆయన సంఘసంస్కారియే. కాని వీరేశలింగాదులవలె సంస్కారవాదములో నడుముబిగింపలేదు. రాజకీయరంగములో నీయన పిఱికివానివలె మెలఁగెను. సాహిత్యరంగమునమాత్రము పిఱుదివియలేదు. ఆయనవేషములో నొకవిద్యాధికత యుండెడిది. ఆకారము స్వచ్ఛమైనది.

పంతులుగారు గౌరవకుటుంబములోనివారు. వీరిపితృపాదులు మునగాలరాజుగారి (శ్రీనాయని వేంకటరంగారావుబహద్దరు) ముత్తవతల్లిగారియొద్ద 'దివాను'గాఁబనిచేసినప్రసిద్ధాంధ్రులు. శ్రీమునగాలరాజుగారితో లక్ష్మణరావుగారికిఁ బెద్దనేస్తము. పంతులుగారివలెనే రాజుగారుకూడ భాషాభిమానులు. వీ రిర్వురకు నిరంతరసాహిత్యచర్చలతోఁ గొంతకాలము గడచినది. రావుగారిసద్వర్తనము భాషాపరిజ్ఞానము రాజుగారిమనస్సున కెక్కినది. దానిచే వారియొద్ద నాంతరంగికకార్యదర్శిగాను 'దివాను'గాను బనిచేయుట తటస్థించినది. లక్ష్మణరాయరంగరాయలు కృష్ణార్జునులవలె వర్తిల్లిరి. ఉద్యోగము చేయుచున్నను వీరు భాషావలోడనము వీడ లేదు. మునగాలరాజావారిసాహిత్యాభిరుచి పంతులుగారిభాషాశాస్త్రపరిశోధనమునకు మిక్కిలి దోహద మొనరించె నని పెక్కురు వక్కాణింతురు.

లక్ష్మణరావుగారు స్వతంత్రాశయులు. ఛత్రపతిశివాజీకి జన్మదేశమగుమహారాష్ట్రదేశమునఁ బంతులుగారు బాల్యకౌమారదశలఁ గడపిరి. కవయిత్రియగు తనయక్కగారి యాదరమునను, తమబావ బండారు మాధవరావుగారి యభిమానమునను లక్ష్మణరావుగారు నాగపూరు నివాసముచేయుచు మహారాష్ట్రము మాతృభాషవలె ధారాళముగ నభ్యసించిరి. ఆభాషలో వీ రనేకవ్యాసములు, పద్యములు రచించినటులు తెలియును. 'మోరోపంత్' అనుమహారాష్ట్రకవి వ్రాసిన కర్ణపర్వ

ముసలు మనవంతులుగారు పరిష్కర్తలుగా నుండిరన్న విషయము తెలిసినచో వారి కాభాషలోఁ గలపాండిత్యము తెలిసినట్లే యగును. వీరేశలింగముగారికి వంగభాషపై నెంతయభిమానమో, మహారాష్ట్రము మీఁద మన లక్ష్మణరావుగారి కంత మమకారము. ఆదేశమందలియభిమానము వీరిచే 'మహారాష్ట్ర విజృంభణము' వ్రాయించినది. ఈయన మధ్యపరగణాలలో బి. ఏ. పట్టభద్రుఁడై, వంగకళాపరిషత్తులో ఎమ్. ఏ పట్టము బడసిన మేధావి. సంస్కృతపరిచయము కలవాఁడు. మహారాష్ట్రములో మంచి ప్రవేశము గలపండితుఁడు. ప్రాచీనులను నర్వాచీనులను సమముగా గౌరవించిన లౌకికుఁడు. నైతికముగ తిలకుమహాశయుని శిష్యత్వ మంగీకరించిన బుద్ధిమంతుఁడు. నిరంతరశాసనపరిశీలనముతోను, నిరంతరచరిత్రపరిశోధనముతోను సంసారమును మఱచినకర్మశీలి.

'ఆంధ్రబ్రాహ్మణులలోని నియోగి వైదిక భేదకాలనిర్ణయము'- 'కృష్ణరాయలనిధనకాలము'- 'ఏకశిలానగర మోరుగల్లే'- మున్నగు చారిత్రక వ్యాసములు 'త్రిలిఙ్గమునుండి తెలుఁగు పుట్టెనా? లేక తెలుఁగునుండి త్రిలిఙ్గము పుట్టెనా?' ఇత్యాది భాషావ్యాసములు ప్రకృతిశాస్త్రము- రసాయనశాస్త్రము-కర్మయోగము- లలితకళలు- పంచాంగము- మున్నగురచనలు లక్ష్మణరావుగారి వివిధవిషయనివిష్టబుద్ధికౌశలమును, సునిశిత విమర్శనపటుత్వమును వేనోళ్ల నుద్ఘోషించుచున్నవి. ఎన్నఁడో

౧౨వ శతాబ్దినాఁటి 'శివతత్త్వసారము'ను ద్రవ్వి దానికి లక్ష్మణరావుగారు వ్రాసిన పీఠికయు తత్పరిశోధనము కనుఁగొన్నచో వారిశక్తి బహుధా తెల్లముకాఁగలదు. 'లక్ష్మణరాయవ్యాసావళి' విజ్ఞానచంద్రికా ప్రతిబింబము.

౧౯౧౩ లో విజ్ఞానసర్వస్వరచనోహ పంతులుగారికిఁ గలిగినది. లక్ష్మణరావుగారి యావచ్ఛక్తి 'ఆంధ్రవిజ్ఞానసర్వస్వ సంపుటము' లపహరించినవి. అది యసంపూర్ణమైనను నాయన యశస్సున కనశ్వరత్వ మీయఁగలదు. పంతులుగారి యెత్తుగడ లన్నియు బ్రహ్మాండమును బోలునవి. తన్నుగడ తన్ని పట్టుకట్టి నిర్వహించుట వీరిలో మెచ్చఁదగినసుగుణము. విజ్ఞానసర్వస్వపునరుద్ధరణమునకు మఱియొక కొమఱ్ఱాజు లక్ష్మణరావు- ఇంకొక కాశీనాథుని నాగేశ్వరరావు- అవతరింపవలయును. ఆయదృష్ట మెన్నఁటికో!

ఈమహాశయుఁ డుద్యమించిన 'ఆంధ్ర'సంపుటసంకలనము తుదముట్టినచోఁ దెలుఁగుబాసకు వెలలేనితొడవు వచ్చియుండెడిది. మల్లంపల్లి సోమశేఖరశర్మగారివంటివా రెందఱో లక్ష్మణరావుగారిలక్ష్యమున నడచి పరిశోధకులలోఁ బెద్దగద్దె సంపాదింపఁగలిగిరి. 'అబలాసచ్చరిత్రరత్నమాల' రచించి తెలుఁగున మెప్పుగాంచిన బండారు అచ్చమాంబగారు లక్ష్మణరావుగారి సోదరీమణి. ఈమె సార్థకజన్మురాలు.

---

# వేంకటరామ కృష్ణకవులు

## ౧౮౮౩ - ౧౯౩౯

### ౧౮౮౯-౧౯౧౮

మొదటివారు ఓలేటి వేంకటరామశాస్త్రిగారు. రెండవ వారు వేదుల రామకృష్ణశాస్త్రిగారు. వీరు మేనత్తమేనమామ బిడ్డలు (వేంకటరామశాస్త్రిగారితండ్రి రామకృష్ణశాస్త్రి గారికి మేనమామ. రామకృష్ణశాస్త్రిగారి తల్లి వేంకటరామ శాస్త్రిగారికి మేనత్త) ఆరామద్రావిడ బ్రాహ్మణశాఖీయులు. మొదటివారి జన్మస్థానము పల్లిపాలెము (కాకినాడతాలూకా) తల్లి: కామేశ్వరమ్మ. తండ్రి: నారాయణశాస్త్రి. జననము: 15-11-1883 సం॥ అస్తమయము 3-12-1939 సం॥ రెండవకవి యభిజనము: కాకరపఱ్ఱు (తణుకుతాలూకా) తల్లి: సూరమ్మ తండ్రి: రామచంద్రశాస్త్రి. జననము: 1889 నిర్యాణము: 1918. రచితగ్రంథములు. వ్యాసాభ్యుదయము, దమయంతీ కళ్యాణము (అచ్చతెనుఁగుకావ్యము) ఉత్తరరామచరిత్ర, మదాలస (నాటకములు) దమయంతి, ఇందిరాదేవి, శకుంతల, సుభద్ర(నవలలు) విశ్వగుణాదర్శము, ఉపాయనము, భోజ చరిత్ర, కాత్యాయనచరిత్ర, కవికంఠాభరణము, సువృత్త తిలకము, పాణిగృహీతి, కొండవీటి దండయాత్ర, అత్యద్భుత శతావధానము, శతఘ్ని, అట్టహాసము, పరాస్తపాశుపతము, రామకృష్ణమహాభారతము, ఆంధ్రకథాసరిత్సాగరము (లంబకములు మాత్రము) ఇత్యాదులు.

ఆంధ్రభోజునియాస్థానవిద్వత్కవులగు వేంకటరామ కృష్ణకవుల కవితాప్రతిభ, విమర్శనశక్తి తెలుఁగువారికిఁ దెలిసి

యేయుండును. 1909 సంవత్సరమున రామకృష్ణులు పిఠాపుర సంస్థానమునఁ బ్రవేశించిరి. నాఁటికి వేంకటరామశాస్త్రిగారివయస్సిరువదియాఱువత్సరములకు మించదు. రామకృష్ణశాస్త్రిగారికిఁ బదునెనిమిదేండ్లు దాఁటినవి. సంస్థానప్రభువులు శ్రీరావు వేంకటకుమారమహీపతి సూర్యారాయేంద్రులీ కవకవుల బుద్ధిచాకచక్యమునకుఁ గవితాధోరణికి నానందపడి యవధానవిశేషములఁ గాంచుట కనుమతించిరి.

ఏ సుముహూర్తమున నీజంటకవులు ప్రభువు కంటఁబడిరో యప్పుడే శ్రీవారి యనుగ్రహాంకూరము రామకృష్ణుల యభ్యుదయక్షేత్రమునఁ బడినది. దిగ్దంతులవంటి పండితులమ్రోల నామహాస్థానమంటపమున శతావధానము సేయునపుడు రామకృష్ణులలీలలు పలువుర కానందాశ్చర్యములు కలిగించినవి. సంస్థానాధిపతు లవధానానంతరము మూఁడు నూటపదియార్లు పట్టుసాలువలతో బహూకరించి యాకవులను దమసంస్థానములో నుండఁగోరిరి.

పిమ్మట సత్యద్భుతశతావధానము, శతవిధానము (గంటకు నూఱుపద్యములు చెప్పుట) శతప్రాసము (ఒకేప్రాసము మీఁద నూఱుపాదములు గంటలోఁ జెప్పుట) అష్టావధానము మున్నగువానిచే మనకవులు మహారాజు చిత్తమును మఱింత రంజింపఁజేసిరి. శతప్రాసము చెప్పుసందర్భమున "ఇట్లిరవుగఁ గొన్నిపాదములనే మును గబ్బము తాత సెప్ప నబ్బురపడి

తత్సభాస్థలిని బోరన గద్దియ డిగ్గి గండపెండెరమును గృష్ణశా
యందుఁ దొడె నృపపుంగవ! ...”అని యభిప్రాయగర్భముగా
నెట్లు చెప్పిరో పరికించితిరా ?

వేంకటరామకృష్ణులు పిఠాపురాస్థానమునకు వెళ్ళుచున్నటు లింటియొద్దఁ బెద్దవారి కెవ్వరికిని జెప్పలేదు. పట్టుసాలు వలఁ గప్పుకొని సింహపుఁబిల్లలవలె వచ్చుచున్న యీయువకవులఁ గని తల్లిదండ్రు లానందభరితులైరి. గ్రామస్థు లాశ్చర్యవివశులైరి. ఈజంటకవులలోఁ బ్రథములైన ఓలేటి వేంకటరామశాస్త్రిగారును, ద్వితీయులైన వేదుల రామకృష్ణశాస్త్రిగారును మేనత్తమేనమామబిడ్డలు. జంటకవులలోఁ దిరుపతి వేంకటకవుల పేరు లెట్లు కుదిరినవో, రామకృష్ణకవుల నామము లట్లు సరిపడినవి. ఈకవికోకిలయుగళము పిఠాపురప్రభుని మ్రోల మధురకంఠము నెత్తి యిట్లు పాడినది.

ఆభాష్యాంత మధీత మత్రభవతో విశేశ్వరా త్తర్కశ్చ
తర్కో విశ్వపతే రపి ప్రతిభయా ప్యస్తం పదం కౌతుకా
దాలంకారికశాస్త్రమప్యధిగతం నారాయణాత్కేవలం
దూరే తిష్ఠతు తత్తథాపి కవితావిద్యైవ హృద్యావయోః.

అక్షరలక్ష లిచ్చినప్రభుఁ డట్టికవీంద్రులు కానరా రటం
చీక్షితివార లెల్ల వచియించెదు సుద్దుల నాలకించితే వా
ర్యక్షసదృక్ష ! నీప్రభు దిరంబుగ నేమును గక్షగట్టి ప్ర
త్యక్షము సేయఁబూనెదమె? తత్సములంగవులన్న రేంద్రులన్.

వీరు పీఠికాపురసంస్థానమునఁ బ్రవేశించినతోడనే సుప్రసిద్ధులైన తిరుపతివేంకటకవులతో వాగ్యుద్ధము తటస్థించినది. రామకృష్ణకవులు వయసునఁ జిన్నవారయ్యు నాకవులగ్రంథములలోని దోషములు బయటపెట్టి 'శతఘ్ని' యను ఖండనగ్రంథము ప్రకటించిరి. 'శతఘ్ని' శక్తి నాఁడు పెద్దపండితులనుగూడఁ దలలూఁపించినది. ఈసాహిత్యసమరమునందే భారతము, గీరతము, పాశుపతము, పరాస్తపాశుపతము, అట్టహాసము, తాలుకొట్టనము, శృంగము, కోకిలకాకము మున్నగా నుభయపక్షములవారివి యనేకగ్రంథములు వెలువడినవి. ఈవివాదము గ్రంథవిమర్శనములతో నారంభమై క్రమక్రమముగా ప్రబలించి వ్యక్తిదూషణములకుఁ బాల్పడినది. ఏది యెట్లైన నావివాదము నాఁటివారికి సాహిత్యజిజ్ఞాస కొంత హెచ్చించినది. ఈవాక్సమరమున నాంధ్రదేశమునందలి పండితు లెందఱో కలుగఁజేసికొని పైకి వచ్చిరి. ఇది సారస్వతచరిత్రములోఁ జేర్పఁదగినవాగ్వాదము. ఈవివాదారంభమున రామకృష్ణులు 'కవిత' యను మాసపత్రిక నెలకొల్పిరి. అందీవిమర్శనములు వెలువడుచుండెడివి. ఇది యిట్లు తొమ్మిదిపదియేండ్లవిచ్ఛిన్నముగా సాఁగి యాఁగినది.

దేవులపల్లి సోదరకవులతరువాత వేంకటరామకృష్ణకవులు పీఠికాపురసంస్థాన కవీశ్వరత్వపదవినలంకరిష్ణులై పేరు గాంచిరి. వీరు తెనుఁగున ముప్పదిగ్రంథములవఱకు వ్రాసిరి. శ్లేషయమక చక్రవర్తి యను వేంకటాధ్వరి రచించిన విశ్వగుణా

దర్శమును దెనిఁగించిరి. వెంకటాధ్వరిరచనము నాంధ్రీకరించుట యేటి కెదురీదుట. ఈతనిపద్యములయందు యమకభేదమో శ్లేషాలంకారభేదమో లేనిపద్యములు మిక్కిలితక్కువ. అట్టి విశ్వగుణాదర్శమున కాదర్శప్రాయమగు నాంధ్రీకరణ మొనరించినవారు రామకృష్ణులు. తెలిఁగింపుమచ్చున కొకచోటి మూలానువాదములు మూదలింతును.

నిర్వృత్తాధ్వరకృత్య ఋత్విజ మహో తీర్ణాపగో నావికం
యుద్ధార్తం సుభటం చ సిద్ధవిజయో వోఢార మాప్తస్థః
వృద్ధం వారవధూజనంచ కితవో నిర్విష్టతద్యావనో
ధ్వస్తాతంకచయ శ్చికిత్సక మపి ద్వేష్టి ప్రదేయార్థినమ్.

అవబృథస్నానంబు నాచరించిన సోమ
యాజికి ఋత్విజుఁ డన్నలుక
యేరంతయును దాఁటి తీరమ్ముఁ జేరిన
పాంథునకు నరంగుపైఁ జిరాకు
విజయమ్ముఁగైకొని నిజపురమ్మున కేఁగు
నవనీశతికి బంటునం దసూయ
యిష్టదేశమ్మున కేఁగినపిదప స్వా
మికి యానవాహకుమీఁద విసువు
యౌవన మ్మంతయును జూఱలాడినట్టి
కితవునకు వారసతియెడఁ గేరడంబు
వ్యాధి కుదిరినవానికి వైద్యుపట్ల
వెగటు తా మీయవలసినవిత్త మడుగ.

సంస్కృతమున క్షేమేంద్రమహాకవి రచించిన ఔచిత్యవిచార చర్చ, కవికంఠాభరణము సువృత్తతిలకముఁ దెలిఁగించిరి. ఇంది రాదేవి, సుభద్ర, శకుంతల, దమయంతి మున్నగునవలలు చదు వఁదగినవి. మదాలసనాటకము చాల మధురమైనది. వీరియుత్త రరామచరిత్రాంధ్రీకరణము నాలుగంకములుమాత్రము వెలు వడినది. 'రామకృష్ణ గ్రంథమాలాగుచ్ఛము"లలో వీరి విమర్శ నములు సమగ్రముగాఁ గాననగును. మఱియు నీకవులు తమ కవితాపత్రికామూలమునఁ జాలఁ బ్రాచీనార్వాచీనకృతుల నా విష్కరించిరి. వానిలో మత్స్యపురాణము, పరమయోగివిలాసము మైరావణచరిత్రము, అధ్యాత్మరామాయణము, చంపూభార తము భారతపక్కి పరాశరస్మృతి ప్రబోధచంద్రోదయము ముఖ్యములు.

ఆంధ్రపత్రిక కాలయుక్తి సంవత్సరాదిసంచికలో రామ కృష్ణకవులు "ఆంధ్రకవుల యపరాధములు" అను శీర్షకముతోఁ గొన్ని పద్యములు వెలువరించిరి. ఆపద్యములలోఁ బ్రాచీనకవుల యపరాధములు పరిహాసమునకు వెల్లడింపఁబడినవి. పద్యములు ముప్పది లేవుగాని తెలుఁగుదేశమున గొప్పయలజడి రేఁపినవి. రెండుదాహరించెద.

మారనకథావిధానముఁ జూఱలాడి
కోరి శ్రీనాథు తెరువులఁ గొల్లఁగొట్టి

మనుచరిత్రం బొనర్చి పెద్దన గడించె
నాంధ్రకవితాపితామహుం డన్నబిరుదు.

కొమ్మన కొమరుని కయితకుఁ
గుమ్మరిగురవయ్య లేఖకుండఁట యిది యె
ల్లం బారాశర్యున కొక
కొమ్మ గలుగ వేల్పు వ్రాయఁ గుదురిసలాగో ?

ఈయపరాధపద్యములపై క్షమాపణము చెప్పవలసిన దని ప్రతిపట్టణమున సభలు గావించి తీర్మానములు చేయుచుండిరి. అప్పుడీకవకవులు కాళ్ళుచిఱుఁగఁ ద్రొక్కఁబోను తెలుఁగు సోదరులఁ గని నవ్వుకొనుచు 'దేశభక్తి'యనునొక వ్యాఖ్య వ్రాసి "మేము చేసినది నిందాస్తుతిగాని కేవలనిందగాదు. ఈవిధముగా మేము ప్రాక్తనకవులనుగూర్చి వ్రాయుట యాధునికులకుఁ బ్రాచీనకవిసత్తములపై నెంతగా భక్తివిశ్వాసములు కలవో పరీక్షించుటకే" అని సమాధానము చెప్పిరి. అప్పు డీనవీనపద్ధతిని గనిపెట్టి రామకృష్ణులను సరసు లభినందించిరి. విరసులు పరిహసించిరి. "ప్రాంచీనాంధ్రకవీంద్రాభివందనము" వ్రాసి తమ నిజాభిప్రాయము మరల వెల్లడించిరి. "కౌరవ గౌరవ" మను పేరఁ బాండవులదే యన్యాయ మనియుఁ గౌరవులది న్యాయ మనియుఁ జక్కనిపద్యములు "ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక" లో నావిష్కరించిరి. విషయమెట్లున్నను కవిత్వమునకు జయంతి

రామయ్యపంతులుగారు మఱిమఱి ప్రస్తుతించిరి. ఇట్టి చమత్కారప్రియులు రామకృష్ణులు.

చెన్నపురమున నొక విద్వత్సమాజ మేర్పడి కృష్ణదేవరాయల కొండవీటి దండయాత్రను గూర్చి యొకకావ్యము రసోత్తరముగ రచించువారిలో నుత్తమశ్రేణికిఁ జెందినకవికి బంగారుపతకము బహూకరింతు మని ప్రకటించిరి. ఆపందెములో నీకవులరచనమే నెగ్గినది. అపుడు

మద్రనగరాంధ్ర విద్వత్సమాజదత్త
నూత్నవిమయ క్రియాలబ్ధ రత్నఖచిత
హేమ బిరుదాభిరాములు రామకృష్ణ
రచయితలు పీఠపురయువరాజగురులు

అని చెప్పికొనినారు. ఇట్టి మేనత్తమేనమామబిడ్డలు క్రొత్తపోకడలతోఁ గవితాసరస్వతి నారాధించుచుండ ౧౯౧౮ లో ద్వితీయుఁడగు రామకృష్ణకవి యకాలమృత్యువుకేఁ బాల్పడెను. ఇతఁడాచార్యశంకరులవలె నత్యంతతరుణవయస్సుననే పరమంపదించి యేకైకపుత్రకులు సజీవులునైన తల్లిదండ్రుల దుఃఖాబ్ధిముంచినాఁడు. చనిపోవునప్పటి కీకవికి ౨౫ ఏఁడులయినాడు. ఈసందర్భమున నీతరుణకవివిశిష్టతఁ జెప్పకొనుట యప్రస్తుతప్రశంస కాదు. ఇతఁడు తనపదునొకండవయేఁట 'నరకాసురవ్యాయోగము' నాంధ్రీకరించినాఁడు. పదునాల్గవయేఁట 'దమయంతీకల్యాణము' అను నచ్చతెలుఁగు ప్రబంధము సంతరించినాఁడు. గొప్ప

మేధావి. మూఁడు భాషలలోని మూఁడుపద్యములు కలిపి పైచి వ్యస్తాక్షరి నీయఁగా హేలగఁ జెప్పినబుద్ధిశాలి యితఁడు. కాకరపఱ్ఱునఁ జిన్ననాఁట నితఁడు వీధివెంబడి బోవుచుండున పుడు అరుగులపైఁ బాఠములు చెప్పుచుండు పండితులు జంకు చుండెడివారఁట. ఇతని కబ్బినదంతయుఁ బ్రాక్తనజన్మవిద్యగాని యభ్యస్తముగాదని యచటివా రాశ్చర్యముగఁ జెప్పుకొను చుందురు. ప్రాకృతమునఁ 'గుకవినిందనము' సంస్కృతమున 'కర్ణవిజయవ్యాయోగము' వ్రాసినాఁడు. అవి యముద్రితములు. ఇంతచిన్నతనముననే బహుగ్రంథములు రచించి, సంస్థానకవీశ్వరుఁడై పేరుగాంచిన కృష్ణుఁడు కవిలోకజిష్ణుఁడు.

అంతట నీకవలో మొదటివారగు వేంకటరామశాస్త్రిగారు

అనుఁగుమేనత్తకొమరుఁడై యాశుకవిత
నాకుఁ జేదోడువాదోడునై కడచిన
కృతిసమర్థుండు మారామకృష్ణశాస్త్రి
యున్న నీసాయ మర్థింతునొట్టు దేవి!

అని విచారించుచు సోమదేవభట్టారకవిరచితము, అష్టాదశలంబకాత్మకమునగు 'కథాసరిత్సాగరము' నాంధ్రీకరింపఁదొడఁగిరి. అవి యాఱులంబకము లయినవి. ఆఱులంబకములు నాలుసంపుటములుగా ముద్రింపఁబడినది. 'ఆంధ్రకథాసరిత్సాగరము'లోని కవితాశైలి నాంధ్రదేశములోని పండితకవు లెందఱో మెచ్చుకొనిరి.

కథాసరిత్సాగరము వీరొక్కరు రచించినను 'వేంకటరామకృష్ణప్రణీత'మనియే ప్రకటితము. ఈగ్రంథము శ్రీ పీఠికాపురయువరాజవరులు, ప్రియచ్ఛాత్రులు నగు రావు వేంకటగంగాధరరామరాయకవిరాజుల కంకితము.

ఉపాయనము 'నూటపదియార్లు' అను పేరఁ బరమేశ్వరునిఁగూర్చి సీసపద్యములు వేంకటరామశాస్త్రిగారు వ్రాసిరి. ఈయుపాయనము తెనుఁగువారికనులు కోరగించుగీతాంజలి. ప్రశంసాభాజనమైన యీకబ్బమునకు రావలసినంత పేరు రాలేదు. మచ్చున కొకపద్య మిచ్చి మానెదను—

హృదయపాత్రంబులో నేమియున్నదో కాని
తొలఁకుచున్నది నిన్నుఁ దలఁచినపుడు
ఈమనఃఫలకమం దేమి యున్నదో కాని
మ్రోఁగుచున్నది నిన్ను మ్రొక్కినపుడు
శీర్షపేటిక నేమి చిత్ర మున్నదో కాని
మూయుచున్నది నిన్ను ముట్టినపుడు
ఈభావవీథిలో నేమి యున్నదో కాని
తారుచున్నది నిన్నుఁ గోరినపుడు
రమ్మ! నాతండ్రి! ననుఁజేరరమ్మ! ప్రణతిఁ
గొమ్మ! కరుణించి నన్నేలుకొమ్మ! చేర
నిమ్మ! నీదర్శనంబు నా కిమ్మ! నిన్నె
నమ్మినాఁడను శాశ్వతానందనిలయ!

BH



| | | | |
|---|---|---|---|
| 84 | 13 | విశాఖదత్తుని | కృష్ణమిశ్రుని |
| 96 | 8 | ఆంధ్రపదపారిజాతము | ఇదితొలఁగించి చదువవలెను. |
| 97 | 14,15 | జగన్నాథకవితోఁగూడి ఆంధ్రపద పారిజాతము అను తెనుఁగు నిఘంటువు గూర్చిరి- | జగన్నాథకవిగారి ఆంధ్రపదపారిజాత మను నిఘంటురచనమునఁ గొంతసాయ మొనర్చిరి- |
| 112 | 13 | శిక్షించెను | నేర్చెను |
| 116 | 20 | దళభూమి | నళభూమి |
| 128 | 19 | వచ్చినవారి | నచ్చినవారి |
| 173 | 5 | బధిరము | బధిరత్వము |
| 178 | 2 | Philolagy | Philology |
| 196 | 7 | తేవరాలు | వేరరాలు |
| 211 | 8 | మిార్చి | మార్చి |
| 249 | 8 | శృంగము | శృంగభంగము |

61 వ పుట 13 వ పంక్తి తరువాత నీక్రిందివిషయము పఠింపఁదగు.

పార్వతీశ్వరశాస్త్రిగారి సమకాలికులు శ్రీ ముడుంబ నరసింహాచార్య కవివరులు పైపద్యమునకు రచించిన సంస్కృతానువాదమును గూడ నిటఁ బరిశీలింపఁ గూడును.

తన్వంగీ కుసుమాస్త్ర ఝాంకరణవ జ్జ్యాఘాత చూతాశుగాద్
భీతా కిం శరణం భవేదిహ మయే త్యాలోచ్య వద్యాం జనేః
సా కంజాత మవేత్య పద్మ మభజ త్తద్బాధతే హంత తాం
ఘ్రాతిశ్చే దవలేన కిం వచ ఇదం స్వార్థాత్కథం ప్రస్ఖలేత్.

చూ॥ శ్రీ ఈ. వేం. వీ. రాఘవాచార్యులుగారు ఎం., ఏ.

'కవితావినోదము' (పిఠాపురరాజకళాశాలాపత్రిక. 7 సంపు. 2,3 సంచి. 38 పుట మార్చి 1942.)

# సవరణలు

| పుట. | పంక్తి. | పొరపాటు. | సవరణ. |
|---|---|---|---|
| 4 | 16 | ఏకతానముగాఁ జెవులొగ్గి | ఏకతానులై చెవులొగ్గి |
| 13 | 17,18,19 | పూర్ణచంద్రేణ ఆంగ్ల... సూరిణా ప్రణీత... | పూర్ణచంద్రాంగ్ల... సూరిప్రణీత... |
| 15 | 18 | తండ్రితరము, తల్లితరము | తండ్రివంశము, తల్లివంశము |
| 19 | 2 | ౧౮౧౯ | ౧౮౧౪ |
| ,, | 3 | నియోగి బ్రాహ్మణుఁడు | వేఁగినాటి బ్రాహ్మణుఁడు |
| 20 | 20,21 | తనకుమార్తె నితనికీయఁ దలఁచి... | యతని వివాహమునకుఁ గొంతధన మీయఁ దలఁచి... |
| 23 | 1,2 | దీనికిఁ దెలుఁగు సేఁతయు వారే చేసిరి. | దీనికిఁ దెలుఁగు సేఁత మల్లాది అచ్యుతరామ శాస్త్రిగారు చేసిరి- |
| 24 | 2 | ౧౮౧౯ | ౧౮౧౪ |
| 40 | 9 | సుందరరామశాస్త్రి | సీతారామశాస్త్రి |
| 48 | 10,11 | సింహాద్రి నారసింహ శతకము | సింహాద్రి రామాధిప శతకము. |
| 60 | 20 | క్రొన్ననచేయు... కోయిల కిన్నెఱజేయ జేయటుల్. | క్రొన్ననఁగోయు... కోయిల కన్నెఱ జేయఁ జే యటుల్. |
| 62 | 16 | చ్లోకోత్తగ | చ్లోఖోత్తర |
| 66 | 1 | వనప్పాకము | పనప్పాకము |
| 72 | 4 | వేడత్తైను | రేకత్తైను |
| 76 | 19 | ౧౯౧౫ | ౧౯౨౫ |
| 80 | 8 | టుఁ ఈకవి | టకీకవి |

# పండిత: ఆకొండి రామమూర్తి శాస్త్రిగారి సప్తతిపూర్తి సన్మానవిశేషము.

1944 మే 24 వ తేదీని సుప్రసిద్ధ కవిపండితులు, రాజవైద్యులు నగు ఆకొండి రామమూర్తిశాస్త్రిగారికి అయిలండు పోలవరములో డెబ్బదవ జన్మదినోత్సవము వైభవోపేతముగ జరిగినది. ఉదయము ఏనుజతలుకట్టిన యెడ్లబండిలో నూరేగింపు. మధ్యాహ్నము 4 గంటలకు శ్రీ భూపతిరాజు సూర్యనారాయణరాజావారి దివాణములో సభయేర్పాటు. అధ్యక్షులు శ్రీ జటావల్లభుల పురుషోత్తము ఎమ్. ఏ గారు. సన్మానసంఘపక్షమున సంఘాధ్యక్షులు శ్రీరాజా కాకర్లపూడి బుచ్చికృష్ణంరాజావారు, కార్యదర్శులు డాక్టరు: సరస్వతుల రామమూర్తి, పునులూరి సూర్యప్రకాశరావు గారలు శ్రీ శాస్త్రిగారికి నూతనవస్త్రములు వేయినూటపదార్లు బహూకరించిరి. శ్రీ తునిరాజావారు, శ్రీ భూపతిరాజు సూర్యనారాయణరాజు గారు ప్రత్యేక ప్రత్యేకముగ రు 116 లు ఇచ్చి సత్కరించిరి. అనేకులు మహాకవులు శాస్త్రిగారిని ప్రశంసించుచుం బద్యములు చదివిరి. వానిలో శతావధాని శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారిపద్యములు రామమూర్తిశాస్త్రి గారి జీవితసంగ్రహమును ప్రకటించునవియగుటచే నవిమాత్ర మిచట నావిష్కరింపం గలుగుచుంటిమి.

BIV



# అభినందనాశీస్సు

శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి.

శ్రీకరమై వర్ధిల్లెడి
ఆకొండి కులావతంస మగువానిని స
ద్భక్తిశీలు రామమూర్తిని
మా కామేశ్వరి మనుచు సమస్తవిధము లన్.

పదిరేళ్ళ వాఁడికెఁడు డ
బ్బది కీవయి షష్టి (60) గలుపవలయు నెఱిఁగి కొ
నిదు లటు లాశీర్వచనము
లాదరింపుఁడు రామమూర్తి కొజ్జోగతికై.

బాగుగాఁ గసంగఁ బదియూనసములలో పు
వయసటన్న నమ్మవచ్చు నితని
శానవాలు పండ్లయుం దొక్కటియుఁ గూడ
మొలవలేదు చూడుఁడు లఘుమతులు.

ఇతఁ డస్మత్కులుఁడంతె, శిష్యగణమందే [illegible] సంగాఁడు,తి
ర్పతితో పాటు కవిత్వపున్ రచనలో భాగస్థుఁ, డేస్మహా
మతిసోదర్యుఁ డొకండు శిష్యుఁడగుట న్మన్నించి దీవింప న
ర్హతనాకున్నది,వృద్ధుఁడీతఁడగుటన్ భ్రాజిష్ణుఁ డున్ జిష్ణుఁడున్.

తిరుపతిశాస్త్రిఁ దక్క గణుతింపనినే నితనిన్ గణించి ఘూ
విరచన నున్న భాగవతవీథిని జోటు నొసంగినట్లు ధీ

పరమును తెల్లవా రెఱుఁగువారలె, వారికొననేల? దీనికిన్
దిరుపతిగూడ నొక్కఁడౌనె దేవునిసైత మతండు మెచ్చునే ?

ఆయన కైతయందుఁగల యాదృతిఁబట్టియె నన్నభట్టు నా
రాయణుఁ జేసికొన్నయటులంతయొ యుంతయొ గ్రంథవీథిలోఁ
బాయనిపేర్మి నాతని సభాజితుఁ జేసితి; మాతఁడో, మహా
ధ్యాయుకిఁ *గృష్ణమూర్తికి డినాదృతినం గొంకకొంతపేమిన్.

తిరుపతియొండె వెంకనయు తెల్గొనరింపక దంటకూర దు
స్తరసూని మెంచి వేఱొకభిషక్కునకుఁ గస్థలమీయ, రామమూ
ర్తి రసికుఁడౌటచే నతని తేఁకువ తాఁ గ్రహియించి వేంకటే
శ్వరుఁ డిడెఁ జోటు తిర్పతియు సమ్మతిఁ జూపె యథార్థమింతియే.

వంగదేశమందు వైద్యశాస్త్రులఁ గవి†
రాజు లనుబ గలరు; రామమూర్తి
అట్టి కవియొ! కాఁడు; భట్టుఁడు సుకవి సా
హిత్యపరుఁడు సుజనహితుఁడు వెజ్జు.

పలువురువైద్యులౌ వాదుల పాటవ మందమిఁ బథ్యభోజన
మ్ములు విధియించి రోగబలము న్మఱిరోగిబలమ్ముఁ గూడ ని
మ్ములఁ గదియింతు, రీసుకవిముఖ్యుఁడు వైద్యుఁడు పథ్యభోజన
మ్ముల కెవమీఁ కరోగబలమున్ గ్రసియించు నెఱింగి చెప్పితిన్.

---

* నిశ్శంకుల కృష్ణమూర్తి.

† కవిరాజు నగేంద్రనాథసేను వగైరా చూ.

BVI

4

ఆరామ సద్రావిడా న్వయంబునకుఁ గా
మాకొండి భూషణం బనఁగనొప్పు
నందుఁ గేశనకుఁ ద్రిపురాంబకును యాకొండి
కధికవిఖ్యాతి వైద్యకళయందు
నందు నామెఱిఁగినయంతలోఁ గామన్న
గారు శ్రీఖ్యాతి పెంపార మనిరి
ఆ ఘన సోదరుండైన రామస్వామి
భ్రాతృభక్తికి నెన్న భరతమూర్తి
రామమూర్తి యయ్యనఘు గర్భమునఁ బుట్టి
యింటివిద్యలోఁ బూర్వులనెల్ల మించి
యితరవిద్యకవిత్వముల నెడల నెల్ల
కవులు మెచ్చెడినైపుణిఁ గాంచఁగలిగె.

[నేఁటికి 41 సంవత్సరములనాఁడు నేఁజెప్పినపద్యము.]

కవితనైపుణిఁగాంచి చక్కఁజదరంగంబాడఁగా మించి గా
నవిధిన్ బద్యములం బఠింపఁగల విజ్ఞానంబు నార్జించి వం
శవశంబై మెఱఁబాయకొప్పునల భైషజ్యంబునం జక్రవ
ర్తివినై మించితి రామమూర్తి! శమితార్తి! కీర్తిస్ఫూర్తివై.
ఆకొండి శ్రీపయయంబునందు మఱి శాకాకొండి సంసారపుం
బాకం బేరిఁగూడ రాదనియె నేవార్త్రుత్తు నీమూర్తి న
త్స్తోకం బీఁగరుగారవం బెఱిఁగి సద్యోమాతనాచారదు
ష్పాకాసం బడకుండ వృద్ధిగనుతన్ బ్రాజ్ఞత్వవ్యాప్తితో.

తల్లి లచ్చమగారి తత్తద్గుణస్థితి
పౌరాణికస్త్రీలఖ్యాతి కెచ్చు
తండ్రి రామస్వామి ధన్యతాగరిమంబు
పూర్వతపస్వులఁ బోలఁజాలు
భార్య *సుబ్బమ వృద్ధపాతివ్రతీరీతి
సీతాసతీసతిఁ జెన్నమీఱు
కొమరుండు జ్యేష్ఠుండు గోపాలుఁ డీనాఁడు
వియ్యంకుఁ డనఘుండు విశ్రుతుండు
తక్కుఁగొమరులుఁ గూఁతుండ్రు ధన్యమతులు
మనుమలును మునుమరాండ్రును దను భజింప
దోసకోట నెసంగు రైతుగతి రామ
మూర్తి నిత్యకల్యాణసత్కీర్తి వెలయు.

కామనగారి వైద్యపుఁబ్రకారము వర్ణ్యముగాఁగనుండుఁ బే
ర్గా మనుమేటి కేనియును గల్వపుసేవ యొనర్చుమీఁద నే
యామహితాత్ముఁ డౌషధమునిచ్చుట. నేనిది చూచి చెప్పితిన్
భీముఁడు పైకిఁ జిత్తమతిపేశల మిట్టిభిషక్కు లేఁడటన్.

ఇంత శాస్త్రీయముగ మందు లిపుడెకాదు
మున్న చేసెడివారలు సున్నహళ్లి
రామమూర్తి కామనగారి రాణకన్న
హెచ్చు, పాండిత్యముండిన హేతువునను.

---

* చిట్టెమ అని వ్యవహారము.

రాముఁడు జనించు కతమున
శ్రీ మెఱసిన్ రవికులంబు శ్రీకరుఁ డాయీ
రాముఁడు నాకొండి కలా
రాముఁడు నెగడింపఁ జేయు రాణ నెసంగెన్.

పోలవరంబు కాఁపురము రామస్వామి
గారికిఁ గామన్నగారి కల్ల
కేశవమూర్తి నికేతనం బీరెండు
నూళ్లకు మీఁదు మైళ్లుండు దూర
మేరోజు కారోజు సూర్యోదయం బన్న
గారి రామస్వామిఁ గనుట కేఁగు
నించు కాలస్యమౌనేని కాచునగాదు
తమ్ముని జూడంగఁ దానెవచ్చు
రామలక్ష్మణులకుఁ గట్టి ప్రేమ మున్న
దేమొ ? యీనాఁడు సోదరప్రేమ విట్టి
దగవడకు నేర్చుకొందగునట్టి గుణము
లున్నచో రామమూర్తి యుత్కృష్టుఁ డయ్యె.

ఆరామచంద్రాంఘ్రిప శా
ఖారాజమునం దొకంటఁగా దీద్రుక్షం
సారపు మర్యాదలు నే
నారయ వేఱొకట దేశ మరసిన వాఁడన్.

నలువుర నోళ్లలోఁ బడుట నచ్చునుమో మన రామమూర్తికీ
యలఘుని గౌరవంబునకునై తలపెట్టితి రుత్సవంబు మీరా

# కొన్ని సందేశములు.

Rajah Saheb of Tuni,
18—5—44.

శ్రీ రాజవైద్య కవితారామమూర్తీ!

నేఁడు సుదినము. ధన్యజీవితమునుగూర్చి ముచ్చటించుకొను సదవకాశము కలిగినందున బహుసుదినము.

సలలిత కవితారామములందును, దుర్గమ వైద్యారణ్యములందును, నిరంకుశ స్వేచ్ఛావిహారముసల్పి, పదార్థభావనాధిక్యత వన్నెగాంచి, రససిద్ధిలో రాణకెక్కి, పాకపరిపాకములో కాకలుదీరి, శయ్యాసందర్భములలో సాధన కూర్చి, రీతివైదగ్ధ్యములో రెక్కలుకట్టుకొని వృత్తిపరిణతిలో వినుతినొంది, కలము కల్వములలో సవ్యసాచివోలె సమానమయ్యును అసమానమైన అమృతహస్తపాటవముజూపు తావకచిత్ర విచిత్ర కళాప్రతిభాసమ్మేళనము వనవ్యాఘ్ర న్యాయమునంజేసియు, మణీవలయ న్యాయమునంజేసియు, అస్మదీయరాజాస్థానమున నెన్నటికిని విస్మరింపరానిదై ఊహించుకొలంది ఆనంద తరంగముల నుప్పొంగజేయును. నేటియుత్సవము యావద్బంధుమిత్ర నయనోత్సవమును, అస్మచ్ఛ్రవణోత్సవమును అగుచు విలసిల్లగలదు. ఇట్టితతి ఆయుర్వేదకోవిదులకు ఆయురారోగ్యములను ప్రసాదించుమనుటయు కవిరాజులకు ఐశ్వర్యాభివృద్ధులను అనుగ్రహించుమనుటయుఁ జూడ లోకబాంధవునకు వెండికాగడా పట్టుమనుటతప్ప వేఱొండుకాదు.

(Sd) శ్రీ రాజా వత్సవాయ వేంకట సూర్యనారాయణ
జగపతిరాజు బహద్దరు

---

Yuvarajah of Pithapuram,
'Vasanta sobha' Madras,
10—5—44

బ్రహ్మశ్రీ ఆకొండి రామమూర్తిగారు నాకు గురుతుల్యులు, అత్యంత ఆప్తులు, వారు పూజ్యులు. ఈసమయమున వారికి నా హృదయపూర్వకములైన అభినందనాలను నమస్కారాలను అర్పిస్తూ ఉన్నాను.

(Sd) R. V. M. G. Ramarao.
(పిఠాపురం యువరాజావారు)

---

Kumara Zamindar of Vuyyur,
camp: Mussoric (U. p.)
20—5—44

నేను ప్రస్తుతము చాలదూరదేశములో నుండుటచే తాము తలపెట్టిన ఉత్సవమునకు రాజాలకపోయినందులకు మిక్కిలి వగచుచున్నాను. శ్రీ శాస్త్రిగారి సన్మానోత్సవము విజయోపేతముగా జరుగుగాక! పరమేశ్వరుఁడు వారికి దీర్ఘాయురారోగ్యభాగ్యము లొసంగుగాక!

(Sd) రంగయ్యప్పారావు.

---

Zamindar of Kapileswarapuram,
E. G. Dt. 17—5—44.

ఆకొండివారి ఆయుర్వేద వైద్యము జగత్ప్రసిద్ధమైనది. రామమూర్తి శాస్త్రిగారి ప్రావీణ్యము అత్యంతశ్లాఘనీయము. వీరు వైద్యమునందే గాక ఆంధ్రకవిత్వమునఁగూడఁ బేరువడసినవారు. భగవంతుఁడు లోకోపకారమునకై వీరికి చిరాయురారోగ్యము లొసఁగుగాతమని ప్రార్థించుచున్నాను.

(Sd) B. B. Sarvarayadu.

సుప్రసిద్ధాయుర్వేద వైద్యులును విశేషించి కవులునూ అయిన బ్రహ్మశ్రీ ఆకొండి రామమూర్తిశాస్త్రిగారి సప్తతిపూర్తి సన్మానాహ్వానము చేరినది. కృతజ్ఞుడను. మనదేశసంప్రదాయసిద్ధమగు ఆయుర్వేదమును ప్రజలకొఱ కుపయోగించుచు నిరంతరము ఇతరులబాధ తొలగించుటయందే జీవితము గడపుచు 70 ఏండ్లు గడపిన శ్రీరామమూర్తి శాస్త్రిగారు ధన్యులు. పూజ్యులు. అట్టివారిని గౌరవించుటవలన తెలుగుదేశములో ఆర్యసంప్రదాయములను గౌరవించుట.

(Sd) విస్సా అప్పారావు.

---

పండిత: నోరి రామశాస్త్రి, ఎ. క. ఎ. సి. బెజవాడ.

శ్రీశాస్త్రిగారు ఆయుర్వేద వైద్యనిష్ణాతులగుటయే గాక పండితులును కవులునుగూడ నగుట మిగుల ప్రశంసనీయము. బాలజ్యోతిషము, వృద్ధవైద్యము అనువాడుక వీరు సార్థకముచేసికొనినారు. పాండిత్యముతో పాటు చిరకాలానుభవముకలిగి వీరు క్రియారూపమున ఆయుర్వేదమునకు వన్నెదెచ్చి దేశమునకు మహోపకారమొనర్చియున్నారు. ఇట్టి మహనీయుని తామందఱు సన్మానముచేయుట శ్లాఘనీయము.

(Sd) నోరి రామశాస్త్రి.

సభానంతరము శ్రీరామమూర్తిశాస్త్రిగారి

# ప్ర తి వ చ న ము

శ్రీలలనా హృదయేశుఁడు
పాలవరస్థేశుఁ డఖిలభువనావనదీ
క్షాలోలుఁడు కేశవుఁ డు
ద్వేలశుభము లొసఁగుఁగాక ! దేశీయులకున్.

ఆయుర్భాగ్యముగోరి నాకిపుడు మీ
రత్యాదృతిన్ సత్కృతిం
జేయంబూనితి; రేను సిద్ధపడి యా
సీనుండనైతిన్ జగ
ద్గేయుల్గల్గు సభాస్థలమ్మున 'ననుం
గీర్తించుకొం' డంచు నా
యీయామోదము వృద్ధమార్గముగ మీ
రే యెంచి మన్నింపరే !

పారమార్థ్యము లం లేనిపోల్కి వర్తించిన
శ్రీమదచ్యుతరామ భూమివిభుఁడు
అఱమఱ లేని నెయ్యమున నాకుపదేశ
మొనరించు రామచంద్రోత్తముండు
ఒకటియై భేదమించుక యేని తలఁపని
సుకవి వేంకటరామసోదరుండు
కవితలోఁ జేదోడుగానుండి నన్నుఁ బ్రో
చేచిన నిశ్శంక కృష్ణమూర్తి

అక్కటక్కట ! వీరెల్ల నొక్కరొకరు
కడచిపోయిరి నాచెల్మివిడిచి మున్నె;
తగుదునని డెబ్బదింబడి మిఁగిలె నొక్క
ప్రాణమిది మీరొనర్చు సన్మానమునకు.

నా పాండిత్యము నాకవిత్వరచనా
నైపుణ్యముం గాంచి మీ
రీపాట న్నను సత్కరింపరనియే
యేనెంతు; నొక్కింత యే
దో పేరున్నది నాకు దేశమున నా
యుర్వేదమం, దద్దియున్
మాపిత్రార్జితవృత్తియొం జెలఁగి సం
భావింపుఁడీ సోదరుల్ !

అనవలసి యుంటేఁగాని మీ రందఱిపుడు
కానఁబఱిచెడి మహనీయ గౌరవమున
నుల్ల మానందరస సమోత్ఫుల్లమయ్యెఁ
దొడరి, డెబ్బదియేండ్లవృద్ధునకు నాకు.

ఈ నాసన్మానమునకుఁ
బూని యొసఁగినట్టి విత్తమును మొత్తం బే
దేని ప్రజోపకృతికిఁగా
దానము చేయుందు ! దాన ధన్యుఁడనగుదున్.



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA103B114 |
| పుస్తకం పేరు | ఆంధ్ర రాజబాలికలు |
| తారీఖు | 25-10-2024 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 289 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 5a |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | SK. Rehana |
| పేజీలు విడదీసినది | REHANA |
| స్కాన్ చేసినది | Ruksana |
| పరీక్ష చేసినది | lakshmi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |